

రచయిత - తడకమళ్ళ రాంచందర్‌రావు

జననం - 12-10-1952

తల్లిదండ్రులు - తడకమళ్ళ సీతారామమ్మ, నరసింహారావు

క్వాలిఫికేషన్ - యం.ఏ. (తెలుగు), యం.ఇడి.

వృత్తి - ఉపాధ్యాయుడు

ప్రవృత్తి - కళారంగము & యోగా (యస్.యస్.వై.)

వ్యాసంగము - రచన, నటన, దర్శకత్వం, యస్.యస్.వై. తరగతులు

గురువులు - దీక్షిత్, జి.ఎస్.ఎన్.శాస్త్రి, బుజ్జా సుబ్రహ్మణ్యశాస్త్రి,
డి ఏ. పాండురంగారావు, పానుగంటి చంద్రశేఖర్

యోగా గురువులు - ప్రేం చిద్విలాస్ (బాబూజీ), ఋషి ప్రభాకర్‌జీ, రవీజీ

రచనలు
- పౌరాణిక పద్య నాటకాలు - 1) ఉషాపరిణయం 2) పౌలస్త్య 3) నలదమయంతి 4) అంబికా విజయం
- సాంఘిక నాటకాలు - 1) త్వంజీవశరదాంశతం 2) నిత్యాగ్ని
- సాంఘిక నాటికలు - 1) దండకారణ్యం, 2) కళాజీవి 3) రిగ్-వేదం
- రేడియో నాటకం - కళాజీవి
- టి.వి. ఎపిసోడ్ - కోటీశ్వరుడి కూతురు
వీడియో రచనలు - 1) అనుబంధం 2) కనువిప్పు

ఏక పాత్రలు - 1) పాలికేక 2) కళాజీవి 3) వేశ్యాద్రష్టుడు 4) కర్ణ

ప్రత్యేకత సాధించిన పాత్రలు -
పాండవోద్యోగం - భీముడు
మోహినీ భస్మాసుర - భస్మాసురుడు
వాసవీ కన్యకా పరమేశ్వరి - విష్ణు వర్ధనుడు
సత్యహరిశ్చంద్ర - విశ్వామిత్రుడు
ఉషా పరిణయం - బాణాసురుడు
సీతాకల్యాణం -రావణ, విశ్వామిత్ర
సతీసావిత్రి - యమ ధర్మరాజు
కళాజీవి - శంకరం మాష్టారు
దండకారణ్యం - నాగరాజు
త్వంజీవశరదాంశతం - నాగభూషణం
మొదలైన అనేక పాత్రలు, ఏకపాత్రలు

బహుమతులు - ఉత్తమ రచన, ఉత్తమ దర్శకత్వం, ఉత్తమ నటుడు,
ఉత్తమ విలన్, ఉత్తమ ఏకపాత్ర, అనేక బహుమతులు

ప్రముఖ అవార్డులు - నంది అవార్డు (2000), కళాజగతి-ఉత్తమ నటుడు,
కె. వెంకటేశ్వరరావు అవార్డు, టి. కృష్ణ మెమోరియల్ ఉత్తమ
నటన పురస్కారం, లయన్స్ క్లబ్ పురస్కారం.

ఆకాంక్ష
- రంగ స్థలానికి సేవచేస్తూ ఉత్తమ కళాకారులను తీర్చిదిద్దడం
- యస్.యస్.వై. ద్వారా అనేక మందికి యోగా శిక్షణ నివ్వడం
- సమాజ సేవ - ఉత్తమ విద్యార్థులను అందించడం.

# ఉషా పరిణయం

**తడకమళ్ళ రామచందర్‌రావు**
ఎం.ఏ., ఎం.ఇ.డి.

ఇంటి నెం. 32-1/21,
రామచంద్రుగూడెం,
మిర్యాలగూడ - 508 207
నల్లగొండ జిల్లా - ఆం.ప్ర.
ఫోన్. 44737 (08689)

**హారితస ప్రచురణలు**

# ఉషాపరిణయం

## తడకమళ్ళ రామచందర్‌రావు



వెల రూ. 40-00

ప్రథమ ముద్రణ 2001 సెప్టెంబర్

ప్రతులు : 1000

ముఖచిత్రం :
కె. రవీంద్రాచారి, డ్రాయింగ్‌మాస్టర్
జి.ప.ఉ.వ. కొండ్రపోల్

ప్రతులు లభించు చోటు :
శ్రీ పులి శేషయ్య, తెలుగు పండిట్
రంగస్థల నటులు
ఇంటినెం. 97, శ్రీనివాస నిలయం,
మయూరినగర్, ఈదులగూడ,
మిర్యాలగూడ - 508 207.
నల్లగొండ జిల్లా, ఆం.ప్ర.
ఫోన్. 44631 (08689)

ముద్రణ :
పార్థసారథి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
నల్లగొండ - ఫోన్. 44184, 31244



శ్రీ తిరుమల తిరుపతి

దేవస్థానం వారి

ఆర్థిక సహాయంతో

ముద్రించబడినది.

# అంకితం



రచయిత తల్లి : తడకమళ్ళ సీతరామమ్మ W/o. నరసింహారావు

## అమ్మా!

సీ॥ త్వద్గర్భగోళాన తన్మయంబున బెంచి
జన్మనిచ్చినయట్టి జననివీవు
చిన్ననాటి చిలిపి చేష్టల భరియించి
మాలిన్యములగొన్న మాతవీవు
గోల చేయగమాన్పి గోరుముద్దల బెట్టి
తమిమీరదనిపిన తల్లివీవు
మాటపాటలనేర్పి మంచిచెడులనేర్పి
ఆదిగురువునైన యమ్మవీవు

తే.గీ. నాదుదోషాలు సైరించి నన్నుబెంచి
ఎల్లవేళల దీవించితుల్లమలర
అంకితంబిత్తు నాకృతినందుకొనుచు
అరయనాశీస్సులందించుమమ్మనాకు

తే.గీ. అమ్మ పిలుపునం దెంతటి యాదరింపొ
అమ్మ చేముద్దకెంతటి కమ్మదనమొ
అమ్మయొడిలాలనెంతటి యమర సుఖమొ
అమ్మ యాశీస్సులంతటి యాస్తినాకు

- రచయిత

"లలిత కళాప్రపూర్ణ"
బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రి
"కళా నిలయం"
12-2-709/సి/89, పద్మనాభనగర్,
హైద్రాబాద్ - 28.



# ముందుమాట

మిర్యాలగూడ కాపురస్థులు, తెలుగు పండితులు, బ్రా॥ శ్రీ॥ పులి శేషయ్యగారు నా కాత్మీయమిత్రులు, కళాకారులు, తెలుగన మక్కువగలారు, తెలుగువారు. వారి పూనిక, కోరికల మేరకు నాకు చేరిన నాటకం "ఉషా పరిణయం" వ్రాత ప్రతి.

ఈ నాటక రచయిత చిరంజీవి తడకమళ్ల రామచంద్రరావు నటునిగా పరిచితుడు.

పై యిరువురు వ్రాత ప్రతిని నాచేతిలో వుంచారు పరిశీలించమని. పలుమార్లు చదివాను వుత్కంఠతో ఆ నాటక రచనా విధానం నన్నన్నిమార్లు చదివించింది. నా కనిపించింది - ఇంటిపేరు "తడకమళ్ల" అంటే "తెర తీయగా", రామచంద్రుడు" అంటే "ఆనంద చంద్రికా ప్రసాదనమూర్తి" అని. అంతర్గర్భితమై మోక్షసాధనా మార్గం అడుగడుగున ప్రత్యక్షం. అందుకేనేమో "పరిశీలించండి" అన్నారు. పరిశీలన ఆత్మీయం. ఆత్మీయ మిత్రులు గదా! కవిగారు కూడ "ముందుమాట పలకండి" అనలేదు. అయినా పలకకుండ వుండలేను. తొణికి, పొరలితే, దొరలక మానదు కనుక.

"శివేతరక్షతమైన కావ్యాలు రావటం లేదు" అంటున్నారు. ఇదిగో శివంకరమైన దృశ్యకావ్యం వచ్చింది. "ఉషాపరిణయం" మనను మెచ్చింది.

నాటకంతో ఏమాత్రం పరిచయం వున్నా, "ఉషా పరిణయం" పేరు విన్నా, కూచిపూడి భాగవతం, బ్రా॥శ్రీ॥ వేదాంతం సత్యనారాయణ శర్మగారు జ్ఞప్తికి రాక మానరు.

"మళ్లీ ఎందుకదే పురాణం"? అనుకొన్న వెంటనే లెంపలు వాయించుకొన్నా, విశ్వనాధవారి మాట గుర్తుకొచ్చింది.

"మరల నిదేల రా। మాయణం బన్నచో
యీ ప్రపంచకమెల్ల। నెల్ల వేళ
తినుచున్న యన్నమే। తినుచున్న దిన్నాళ్ల
తన రుచి బ్రతుకులు। తనవి కాన".

ఒక్కొక్కరి వంటకం ఒక్కొక తీరు. కంటి కందక మనసును తాకేరుచి. అసలు మన పురాణ వాఙ్మయ రీతి అదొక విలక్షణం. బూతుగా అనిపిస్తుంది. నీతిని బోధిస్తుంది. సాక్ష్యాని కందదు. మోక్షాన్నిస్తుంది. అది దిగంబరం కాదు. శ్రమకోర్చి, తెర తీసి, పరిశీలించితే దొరికే పరానందం. మరపురాని మార్గం. విద్యా విధానంలో జ్ఞాపనా సిద్ధాంతంగా పాశ్చాత్యులు సహితం అంగీకరించారు "మెమోరి ఆఫ్ ఎడ్యుకేషన్ సిస్టమ్" అని.

నా కనిపించింది యీ నాటకం గర్భవతియైన కన్యకు కల్యాణం "ఉషా పరిణయం" అనటం కంటే "కల్యాణానిరుద్ధం" అంటే బాగుండేదేమో?! అని. అతగానికి గర్భధారణం లేదు కనుక, తండ్రిగా కల్యాణం దర్శనీయం కనుక. కాని ఆ పేరు అందరికి అర్థం కాదు, అనుకోవచ్చు. పరిశీలన లేక సూక్ష్మ నిజతత్త్వం ఏదీ-ఎప్పుడూ-ఎవ్వరికీ అర్థం కాదు. కవి సూచనా మాత్రంగా అందిస్తాడు. దర్శకుడు పరిశీలించి చూస్తాడు. అందుకే అతడు దర్శకుడు. అతని శిక్షణలో నటులు కవి భావాన్ని సూటిగా ఆవిష్కరిస్తారు. అది నాటక ప్రక్రియ. అవలోడనం లేక నాటకం అర్థం కాదు. అందునా పురాణనాటకం.

కవి హృదయాలోకనం చేసుకొందాం.

ఇది దర్శక విధి.

విమర్శక విధి.

తెర ముందుకు నారద మహర్షి వొస్తాడు "ముల్లోకముల సంచరించు, కలహాశనుడను" అంటూ కలహమే అశనముగ - భోజనముగ నైనవాడు కలహాశనుడు. భోజనం అంటే లోనికి తీసుకొన్న పదార్థసారాన్ని ఓషధిగా మార్చి, పిప్పిని విసర్జించటం.

నారద మహర్షి కలహాన్ని అమృతమయం చేయగల జ్ఞానమూర్తి. జ్ఞానం ఎల్లవేళల ముల్లోక వ్యాపని. వ్యాపని రజోగుణతత్త్వం. రజోగుణ సంయుక్త సత్త్వగుణం ధర్మక్రియా శీలమౌతుంది. అందుకే అతడు జ్ఞానదాత. "నారం దదాతీతి నారదః". నాటకం జ్ఞానదాతతో ప్రారంభమై, జ్ఞానదానంతో ముగుస్తున్నది. అంటే మోక్షమార్గ సూచన చేస్తున్నదన్నమాట. పరిశీలన చేదాం.

అది శోణపురం, శోణ-ఎఱ్ఱని, పురం-నగరం. ఇప్పటికీ రాజస్థాన్‌లోని జైపూర్‌ను "రెడ్ సిటీ" అంటారు. ఎఱుపు రంగు రజోగుణానికి ప్రతీక. అది రాజపుత్రుల పట్టణం. వీరభూమి. రజోగుణప్రధానం. ద్వాపరంనాడు శోణపుర పాలకుడు బాణాసురుడు. బాణ+అసు+రః=బాణాసురః. బాణ - తన తృప్తికై ఎదుటి వారిని హింసించునట్టి, న+సుం=అసుం- మంచికాని, దుష్ట తత్త్వమును, ర+గృహ్ణాతి-పొందునట్టిది. తన తృప్తికై ఎదిరిని హింసించే తమోగుణం "శోణపుర" మనే రజోగుణానికి అధిపత్యం వహించింది. ఇక్కడ తమోగుణం రజోగుణంతో

కలిసింది. రజోగుణ సంయుక్త తమోగుణం అధర్మ క్రియాశీలమౌత
దుష్కర్మాచరణంలో చైతన్యవంతమౌతుంది. తపించింది. వరఫలంగా తమో
లక్ష్యమైన శంకరుని మెప్పించింది. కావలిగా వుంచుకొన్నది.

శంకరుడు లయకారుడు. మిగల్చక సర్వమును లోగొనువాడు.
తమోగుణ లక్ష్యతత్త్వం. ఆ స్వామి ఆయుధం త్రిశూలం. మూటిని నశింపచే
సత్త్వ, రజ, స్తమో గుణాలను, మూడింటిని, స్థూల-సూక్ష్మ-కారణ దేహాలను మూడి
హరించేది. తాను మిగుల్చుకోక, ఎదుట మిగులనీక, సర్వాన్ని భూతిగా చేసే
తమోగుణలక్ష్యతత్త్వం. అదే మోక్షతత్త్వం. పుట్టుక-చావుల మధ్యగల చై
లేనిదన్నమాట. చేతన లేనిది తమోగుణం.

అందుకే మన పురాణ వాఙ్మయంలో శివుడెవ్వరినీ చంపడు. చావు
పుట్టుక వుండాలి. ఆ స్వామి లయించుకొంటే అది మోక్షమే. జనన, మ
కతీతం.

విష్ణుతత్త్వం స్థితి శక్తి. అందుకే ఆ స్వామి హతమారుస్తాడు. అది
సంహరణం కాదు, దుష్ట శిక్షణ. హరితో చంపబడినవారు మళ్ళీ మరో జన్మనెత్తు
కనుకనే ఆ విష్ణుస్వామి "ధర్మ సంస్థాపనార్థాయ-సంభవామి యుగే య
అనేకానేకవతారాలెత్తుతాడు. ఒక్కొక్క అవతార ప్రయోజనంగా అధర్మనాశంగా ధ
స్థాపించి, ఆ అవతారాన్ని చాలిస్తుంటారు. మళ్లీ మరో అవతారం.

ఇందులో వారెక్కువ, వీరు తక్కువ అని కాదు. ఎవరి కర్తవ్యాన్ని
మాత్రమే, సక్రమంగా నిర్వర్తించటం. అది ధర్మసూక్ష్మం. అందుకే శివుడు వరమి
బాణా సురుణ్ణి సంహరించడు. కృష్ణావతార మూర్తి అయిన విష్ణు స్వామి ఆ బా
సహస్ర బాహుబల దర్పాన్ని హరించాడు.

శంకర శక్తి కావలి వానిగ చేరిన వెనుక నాటకంలో "ఉష" పాత్ర
జరిగింది. తమో రూపమైన బాణాసురునిలో కూడ శంకర సంయో
"ఉషోదయం-వెలుగు-బుద్ధి కలిగిందన్న మాట, ఆ బుద్ధి అనిరుద్ధాన్ని
న+నిరుద్ధము=అనిరుద్ధము - ఎదురులేని, అడ్డులేని, సర్వ వ్యాప్తమైన జ్ఞానాన్ని!
అనిరుద్ధుని చిత్రరేఖ తెచ్చి, ఉష కందించింది.

చిత్+త్ర+రేఖ=చిత్రరేఖ. చిత్-ఆత్మ తత్త్వమును, త్ర-ర
రేఖ-కాంతికిరణం. "చిత్కళ" అన్నమాట. జ్ఞానం అన్నమాట.
బుద్ధికి-ఉషకు-సహకరిస్తుంది. జ్ఞానమే, జ్ఞానమేదో గుర్తిస్తుంది. జ్ఞానాన్ని అం
చిత్రరేఖ కుంభాండుని కూతురు. కుంభక ప్రాణాయామ సాధన

రూపంగా లోకాని కందించింది. అందుకే కల్యాణం. అది లోక కల్యాణం. ఆ కల్యాణాన్ని అడ్డగించిన బాణాసురుని సహస్ర బాహువులను కృష్ణస్వామి ఖండించాడు. శంకరుడు సమ్మతించాడు. బాహువుల బీట తీరాలన్నది బాణాసురుని కోరిక. తీరింది.

"కృషిః "భూ" వాచకశ్శబ్దః
"ణః" చ నిర్వృతి వాచకః
తయోరైక్యం పరంబ్రహ్మ
కృష్ణయితి అభిధీయతే ॥

తమో గుణ ప్రధానమైన భూ సంబంధ ఐహిక త్రిగుణ వృత్తి రాహిత్య శక్తి కృష్ణ రూపం. కనుక తమోగుణ రూపమైన బాణాసురుని సహస్ర బాహువులనూ-వేవిధాలైన కర్మ ఫలాన్ని- వ్యాపక విష్ణుశక్తి (జ్ఞానం) కృష్ణరూపంగా హరించింది.

ఇది శివేతర క్షతమైన కావ్య లక్షణం.

ఇక వ్యవహార విధమైన లక్షణం.

కులాతీతమే కాదు - జాత్యతీతంగా ప్రేమకు వున్న ప్రాతినిధ్యం. ఉష రాక్షస కన్య. అనిరుద్ధుడు మానవ యువకుడు. ప్రేమించింది. అదీ కలలో. అంటే స్థూల దేహంతోకాదు. సూక్ష్మదేహంతో. జాగ్రదవస్థలో కోరితే యింద్రియ వ్యాపారం వున్నది. కనుక అది కామం కావచ్చు. స్వప్నావస్థలో యింద్రియ వ్యాపారం లేదు. మనో వ్యాపారం వున్నది. కాబట్టి అది ప్రేమ, ఉషకు అనిరుద్ధుడు మనోహరుడు.

జాతి, మత పట్టింపులతో పెద్దలు ప్రేమకు అవరోధం కలిగిస్తే అది ప్రళయం, అనుమతిస్తే అది ప్రణయం, కల్యాణం.

ప్రఖ్యాతమైన ఒక పురాణ కథకు ఎంత చక్కని రూపక వ్యాఖ్యానం!

మిత్రశ్రీ పులిశేషయ్య గారి అభిరుచికి అభినందనం.

రచయిత చిరంజీవి తడకమళ్ల రామచంద్రరావుగారి ఉపజ్ఞకు నమోవాకం.

ఇలానే యికముందూ వీరికలం యెన్నెన్నో కల్యాణాలు (లోక కల్యాణాలు) చేయాలని అక్షరాక్షతలు.

భవదీయ

బుర్రా సుబ్రహ్మణ్య శాస్త్రి

జోసి వీరనారాయణశర్మ
M.A., M.Phil., Ph.D., B.Ed.
•తము'
ంకటేశ్వర కాలనీ, నల్లగొండ.



# ఉషోదయము

ావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" యనునది అభిజ్ఞోక్తి. యులందు నాటకము శ్రేష్ఠమని స్పష్టము. సంస్కృత వాఙ్మయమునందు ం లెన్నియో రచింపబడినవి. కవికుల గురువు కాళిదాసుని 'అభిజ్ఞాన లము' వానిలో తలమానికము, కాగా తెలుగునాట నాటకరచన లిత కాలమునందే అధికముగ సాగినది. బహుశః తెలుగు ముసందు యక్షగానములు దేశీయ రచనలుగా ప్రయోగము టచే గాబోలు, కవులెవ్వరును పూర్వయుగముల నాటక రచన కనిపించదు. రాజాస్థానములందు సైతము సంస్కృత నాటకములే ంపబడినవి.

నునిక తెలుగు సాహిత్యము సందారంభ దశలో సంస్కృతాంగ్లానువాద వచ్చినవి. బలిజేపల్లి "హరిశ్చంద్ర", చిలమర్తి 'గయోపాఖ్యానము' బి 'పాదుకా పట్టాభిషేకము', తిరుపతి వేంకట కవుల 'పాండవోద్యోగ ములు' వంటి నాటకాలు తెలుగుజాతి సంస్కృతీ వికాసానికి దోహదము ంగ వచ్చును.

రాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో పౌరాణికాలది ప్రత్యేక స్థానము. •దరమును పొంది, వేలకొలది ప్రదర్శనలకు పాత్రమైనవి పౌరాణికాలే. లోనే శ్రీ తడకమళ్ల రామచంద్రరావు గారి, 'ఉషా పరిణయము' కొత్తగా క్కని పౌరాణిక నాటకము.

రాణ గాథలలో ఉషా పరిణయోదంతము మిగులనద్భుతావహమైనది. నిన వరుని, ఆమె ఇష్ట సఖి చిత్రరేఖ తనయోగ విద్యామహిమచే, వరులందరి చిత్రపటములవిలిఖించి, కలలోగాంచిన సుందరుని చ్చె అనిరుద్ధునిగా గుర్తించుటకు మార్గము సుగమము చేసినది. ం ఉష కోరికపై తన యోగ విద్యా ప్రభావముచే, ద్వారకయందున్న

యనిరుద్ధుని, శోణ పురమునందలి ఉషాంతఃపురమునకు చేర్చిన బాణ, చిత్రరేఖ. ఉషానిరుద్ధుల గాంధర్వ వివాహమునకు కారణ భూతురాలైనది.

ఈ నాటకమునందలి వస్తువు చిత్రమైన ప్రేమికుల వృత్తాంతము. దేవ మానవ రాక్షసజాతులను సమ్మైక్య పరచిన, అద్భుత శృంగార గాథ. జగత్కల్యాణ హేతువైన, విచిత్ర సన్నివేశ సమాహార మీ వృత్తాంతము. ఈ విశిష్ట గాథను నాటకముగా మలచి, శ్రీ తడకమళ్ల వారు తెలుగుజాతికి మరొక పౌరాణిక నాటక రత్నమునందించినారు.

శ్రీ తడకమళ్లవారు అధ్యాపక వృత్తిలోను, సంప్రదాయ నాటకములందు నటనములోను, మంచి పేరు గాంచిన మనీషి. సంగీత, సాహిత్య, నాట్యములలోని శాస్త్రీయ పరిజ్ఞానమును సహజముగానే పొందియున్న వీరు, నాటకరచనకు, అందులోను ప్రస్తుతాధునిక యుగములో పౌరాణిక నాటక రచనకు పూనుకొని, సమర్థముగ నిర్వహించుట సామాన్య విషయము కాదు. ఏబది ప్రదర్శనలకు, ప్రజాభిమానమునకు పాత్రమైన యీ నాటకమే వారి ప్రజ్ఞాప్రాభవమునకు నిదర్శనము.

ప్రస్తుత నాటకము నందు నాంది ప్రస్తావనలు ప్రత్యేకముగ గూర్చబడలేదు. వస్తువు ప్రసిద్ధమని కాబోలు. నాటకారంభమున నారద మహర్షి పాత్రచే నిర్వహింపజేసిన గాన స్వగతములు, నాంది ప్రస్తావనలులేని లోటు తీర్చినవి.

ఐదంకముల యీ నాటకమున మొత్తము మీద పదునొకండురంగములున్నవి. అవియు సందర్భోచితములై నాటకమునకు సమగ్రతను, ప్రధాన రసమునకు పుష్టిని చేకూర్చినవి.

ద్వితీయాంకమునందు కల్పింపబడిన కాలాక్ష వృత్తాంతము హాస్యస్ఫోరకమై, సామాజిక హృదయాహ్లాదజనకమైనది. ఈ పాత్ర కల్పనము నందు కవి కనపరచిన, నైపుణ్యము పండిత పామరామోదమునంది శతథా ప్రశంసింపబడినది. ఇది మధ్యమ పాత్రలైన చిత్రరేఖా కాలాక్షులచే నిర్వహింపబడిసలక్షణమై, విష్కంభ స్థానమున విరాజిల్లియున్నది.

ఐదవ యంకమున కవి మరియొక చిత్రమైన కల్పనము చేసియున్నాడు. శ్రీకృష్ణ శంకరుల యుద్ధమును విరమింపజేయుటకు, నారదుని ద్వారా పరిష్కారము చూపి, తనకుగల శివకేశవాభేదబుద్ధిని చక్కగ చాటుకొనినాడు. శంకరుడోడె ననుట కిచ్చగింపక, శంకరుడు బాణునకిచ్చిన వరమును మిషగా

చూపి, జగత్ప్రళయకారకమైన శివకేశవ సంగ్రామమును నివారించిన ఘనత నారద పాత్రకు దక్కించుట కడురమ్యమైన కల్పనము. అట్లే యీ యంకము చివర బాణునికి రెండు హస్తములు మాత్రమే మిగిల్చి, అవియు శివపూజార్థమని చెప్పి, శివసన్నిధిని సైతము శ్రీకృష్ణుడు బాణునికి వరముగా ప్రసాదించినట్లు కల్పించుటచేత, శివకేశవాభేదమును మరియొకమారు ఘంటాపథముగ లోకమునకు చాటి చెప్పిన తీరు, సహృదయ హృదయాహ్లాదకారి యగుచున్నది.

ఇందలి పాటలు గానయోగ్యములై, సంభాషణములు సందర్భోచితములై, సంప్రదాయ నాటక సంప్రదాయానుగుణమై, నరసజన మనోరంజకములుగ నున్నవి. పద్య రచన ప్రౌఢమై, పండితజన ప్రశంసాపాత్రమగుచున్నది.

ఇందు ప్రధాన రసము శృంగారము. హాస్య వీరాద్భుతాది రసము లందందు సందర్భోచితముగ సహాయకములై, రసపుష్టికి హేతువులైనవి.

సలక్షణము, సంప్రదాయ బద్ధమునైన యీ 'ఉషా పరిణయము' సర్వజనామోదమునంద గలదనుట నిశ్చయము. ఈ శతాబ్దమునందు, పౌరాణిక నాటక రంగమునకే ఇది 'ఉషోదయ'మని చెప్పదగియున్నది.

*అభినందన చందనముతో...*

**వారణాసి వీరనారాయణ శర్మ**

పులి శేషయ్య
(తెలుగు పండితు)
రంగస్థల నటులు
కార్యదర్శి, సద్గురు శ్రీ త్యాగరాజ నాట్యకళాపరిషత్తు
మిర్యాలగూడెం.
ఇంటి నెం. 97, మయూరినగర్
ఈదులగూడ, మిర్యాలగూడెం
✆ 44631




# అభినందన చందనాలు

"కావ్యేషు నాటకం రమ్యం" అనునానుడి లోకప్రసిద్ధం నేత్రపర్వంగా సాగే నాటకం బహుళ ప్రయోజనకారిగా భాసిల్లుతుంది. అందువల్లనే భారత, భాగవత, రామాయణాది ఇతిహాసిక గాథలెన్నింటినో విద్వత్కవులు నాటకాలుగా మలచి, పండిత, పామరుల ప్రశంసలనందుకొనినారనుటలో అతిశయోక్తిలేదు.

అవిధముగనే మా ఆత్మీయుడు శ్రీ తడకమళ్ళ రామచంద్రరావు రచించిన "ఉషా పరిణయం" పౌరాణిక నాటకం - నాటకాలలో ఒకమణి దీపం, తెలుగుజాతికే గొప్ప బహుమానంగా అందించారు తడకమళ్ళవారు.

వీరి నాటకం తెలంగాణాలోని నలుమూలలా. ఆంధ్రాలో సైతము ప్రదర్శింపబడి జయకేతనం ఎగురవేసిందనుట నిస్సందేహము.

ఉషాపరిణయం కూచిపూడి యక్షగానంగా శ్రీవేదాంతం సత్యనారాయణ శర్మగారు ప్రదర్శింపగా చూశాం గాని, పౌరాణిక నాటకంగా రంగస్థలం మీద ప్రదర్శింపబడుటకు తడకమళ్ళవారు రచించిన "ఉషాపరిణయ"మే ఆదిగా తోచుచున్నది. అట్టి రచనకు దోహదపడినవీరి కృషి శ్లాఘనీయము.

వీరి నాటకం రవీంద్రభారతిలో దృశ్యం, ప్రసారభారతి (ఆకాశవాణిలో) హైదరాబదు ద్వారా శ్రవణం, ప్రేక్షకులను, సెహబాస్ అనిపించగలిగింది. నేను నాయకుడినైతే తాను ప్రతినాయకుడిగా అనేక నాటకాలలో నటించి తన నటనావైదుష్యాన్ని ఊరూర పంచగలిగిన గొప్ప నటనాధురంధరుడు రామచంద్రుడు. సాహిత్య కృషిలో నిరంతరాభిలాషను ప్రవ్యక్తం చేసే సంస్కారం గలవాడు.

మా రామచంద్రుడు వినీతుడు, జిజ్ఞాసువు తెలిసిన విషయాలను సులభసుందరంగా అందరికీ పంచాలనే తపన కలవాడు.

ఇక నాటక పరిశీలనకొస్తే, ఉషా పరిణయం కథను కవి శ్రీ మద్భాగవతం, హరివంశం, అనిరుద్ధచరిత్ర ఆధారంగా కథా సంవిధానం నడిపించారు.

ఇందులో బాణాసుర పుత్రిక ఉష అనిరుద్ధుని పొందాలని కలగనటం, లోకంలో కలలుగనే ఉషలు ఎంతో మంది ఉంటారు కాని ఇక్కడ కలఫలించడం ప్రధానాంశం. దానికి మంత్రి కుంభాండుడి కూతురు చిత్రరేఖ తుంభద్యోగ విద్య ద్వార ఉష మనసుపడిన ఎక్కడో ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుని మనవడు, ప్రద్యుమ్నుని కుమారుడు అయిన అనిరుద్ధుని రావించడం గాంధర్వ వివాహంతో ఉషానిరుద్ధులు ఐక్యంగావడం జరిగింది. చివరకు ఉషానిరుద్ధుల నిజకల్యాణంతో సుఖాంతంగావడం కథా విశేషం.

ఈ నాటకంలో ప్రధానాంశం శృంగారం నాటకానికి ప్రేరణే నారద పాత్ర. శోణపురరాజు శర్వాణీవల్లభపాద పద్మభజనారంభ ప్రవీణుడు. సంగ్రామపారీణుడు, సహస్రబాహుడు సాక్షాత్తు పరమ శివునే తపస్సుతో మెప్పించి తన ద్వారపాలకుని గావించిన వైనం, మూర్ధాగ్రేసరచక్రవర్తియైన బాణుని బందీలో ఉన్న అనిరుద్ధుని విడిపించుటకై, బాణుని సహస్ర బాహులలో రెండుమాత్రమే ఉంచి మిగతావి శ్రీకృష్ణుడు ఖండించటం, అంతబాణాసురగర్వభంగం జరగటం, అహంకార ప్రవృత్తిగలవారిని మేలు కొల్పటం జరిగింది. కనుక ఈ నాటకాన్ని బాణాసుర గర్వభంగం అన్నను అనవచ్చునేమో!

ఇక ముమ్ముందు గూడా వీరి రచనలు రంగస్థలికి తనవంతు కానుకలుగా, లోకులకు నీతి నందించునవిగా, రసాత్మకంగా, పండిత, పామరరంజకంగా, ప్రదర్శన యోగ్యంగా, సాహితీలోక ఆదరణ పొందునవిగా ఉండాలని, అలాంటి రచనలు కవి అందివ్వాలని ఆశిస్తూ మనరామచంద్రుని కుటుంబమును ఆసదాశివుడు సర్వదా రక్షించాలని ఆకాంక్షతో.

మీ శ్రేయోభిలాషి
**పులి శేషయ్య** (తెలుగు పండిటు)
రంగస్థల నటులు

తడకమళ్ళ రాంచందర్‌రావు
M.A., M.Ed.,

రచయిత

ఇంటి నెం 32-1/21, రామచంద్రగూడెం,
మిర్యాలగూడ - 508 207
జిల్లా॥ నల్లగొండ, ఆం.ప్ర.
ఫోన్. 44737 (08689)




## నా మాట..

"నాటకాంతాని సాహిత్యం" అన్నది ఆర్యోక్తి. ఆఉక్తి యుక్తివంతమని యోచించి నాటక రచనకు నాంది పలికాను. అనేకనాటకాలు ప్రదర్శించి, దర్శకత్వం వహించిన అనుభవంతో కొద్దోగొప్పో ఉన్న సాహితీ పరిచయంతో నాటకం వ్రాయాలనిపించడం నటరాజ కరుణా కటాక్షం. నటరాజు కరుణకు పాత్రుని చేయుటకైనన్ను ప్రోత్సహించి ఈ "ఉషాపరిణయం" వ్రాయడానికి నన్నుద్యుక్తుని గావించినవారు శ్రీ పానుగంటి చంద్రశేఖర్, శ్రీ యం. దామోదరాచారి, శ్రీ డి. వేంకటేశ్వరరావుగారలు వారికి నా కళాభివందనాలు.

నాటకం వ్రాయడం ఒక ఎత్తు, ప్రదర్శన మరో ఎత్తు. తొలి ప్రదర్శన ఆర్.టి.సి. వారిచే నిర్వహించిన శ్రీ డి.వి.రావు మలి ప్రదర్శన నటరాజ నాట్యమండలి ద్వారా నిర్వహించిన శ్రీ యం. దామోదరాచారిగారలకు మరొకసారి కళాభివందనాలు. ఈనాటకాన్ని అనేక ప్రదర్శనలు ఇచ్చి, అనేక పరిషత్‌లలో పాల్గొని అనేక బహుమతులందురకొనిన "మిర్యాలగూడ సాంస్కృతిక కళాకేంద్రం" వ్యవస్థాపక అధ్యక్షులు మందడి రాంరెడ్డిగారు, కార్యదర్శి ఏ.వి.ఎస్. ప్రసాద్‌గారు మరియు తదనంతర అధ్యక్ష, కార్యదర్శులు, టి. మారుతిగారు, జి. సాయిలుగారు కార్యవర్గసభ్యులు, సంస్థ సభ్యులు, పాత్రధారులు అందరికీ అభినందన మందారాలు - మరెన్నో ప్రదర్శనలిచ్చిన భారజలకళా సమితి, అశ్వాపురంవారికి దాని నిర్వాహకులు కె. గణపతి, వేంకటేశ్వర్లు మరియు దర్శకులు శ్రీ శేషసాయిగారలకు వారి సంస్థ సభ్యులూ, పాత్రధారులూ అందరికీ అభినందన పూర్వక కుసుమాంజలి. విశేషించి ఈ నాటకానికి మొదట సంగీతం అందించిన శ్రీ రామమూర్తి మాష్టారుకూ, తర్వాత తన ట్యూనింగ్‌లతో అశేష ఆంధ్రప్రేక్షకలోకాన్ని అలరించిన శ్రీ పానుగంటి చంద్రశేఖర్‌గారికి నా వినమ్ర హృదయాంజలి.

ఈ నాటకాన్ని ఆకాశవాణికేంద్రంలో రిజిష్టర్ చేయించి, రికార్డుచేయించి, ప్రసారానికి కారకులైన శ్రీ పులిశేషయ్యగారికి అందులో పాల్గొన్న శ్రీ సద్గురు త్యాగరాయ

నాట్యకళాపరిషత్ కార్యవర్గానికి, నటీనటులందరికీ నా కళాంజలి. అన్నింటినీ మించినపని, ఎవరేగాని చేయలేని పని పుస్తకముద్రణ. ఈ కష్టసాధ్యకార్యాన్ని సుసాధ్యం చేయడానికి పూనుకున్న మిత్రులు, సీనియర్ కళాకారులు, శ్రీ త్యాగరాజ నాట్య కళాపరిషత్ నిర్వాహకులు, పౌరాణిక నాటక రంగంలో తనకంటూ ఒక ప్రత్యేకతను సాధించుకున్న ఉత్తమ గాయకనటులు శ్రీ పులిశేషయ్యగారి కృషి అనితర సాధ్యంవారి సంకల్పబలమే ఈ "ఉషాపరిణయం" ముద్రణకు నోచుకొని ఉషోదయాన్ని పొందడం. నేనున్నానని ధైర్యంచెప్పి, ముందుకు పదమని కదిలించి అలసత్వంచూపినప్పుడు అదలించి, ఆర్థిక అవరోధాలను అధిగమించి, ఎందరోమహనీయుల సహకారం అర్థించి ఈ నాటకం ముద్రింపించినన్ను కృతార్థుని చేయుడమేగాక "అభినందన చందనాలు" అర్పించిన సహృదయులు అశేష సేవానురక్తుడు శేషయ్యగారికి నా మనఃపూర్వక నమోవాకములు.

గురువులు, ఆంధ్రదేశంలోనేకాదు, భారతావనినే కాదు ప్రపంచ పరివ్యాప్తంగా విదేశీయులకుగూడా తననటన ద్వారా పారాయణ ద్వారా హృదయకమలాలను వికసింపచేసిన మహనీయులు, అడగగానే నాయందలి అనురాగంతో శేషయ్యగారి పట్ల అభిమానంతో "ముందుమాట" వ్రాసి యివ్వడమేగాక నా రచనాదోషాలను పరిహరించి నన్ను కృతకృత్యున్ని గావించిన లలితకళాప్రపూర్ణ శ్రీ బుఙ్జా సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నా హృదయపూర్వక అక్షరాంజలి.

సహృదయులు నేను కోరినంతనే నా నాటకాన్ని పరిష్కరించుటకు అంగీకరించిన పరిషత్ మండలి శ్రీ పుల్లాభట్ల కృష్ణమూర్తిశర్మ, శ్రీ నందిభట్ల విజయరాములు, శ్రీ సూలూరి శివసుబ్రహ్మణ్యం, శ్రీ మాదావఝ్ఝల రామనాథం, శ్రీ పులిశేషయ్య మరియు బి.ఎల్. నర్సింహారావు గారలు రచనలోని అసాధు శబ్దాలను సాధుశబ్దాలుగావించి, వ్యాకరణ, భాషాదోషాలను వెదకివెదకి నిర్మొహమాటంగా నిర్మూలించి నా నాటకాన్ని దోషరహితం గావించడానికి ఎంతయో కృషి చేశారు. ఏ మాత్రం పాండిత్య ప్రకర్షలేని నా రచనకు అలంకారం చేసినవారు వీరు, వారికి సుమనస్సుతో నమస్సుమస్సులర్పిస్తున్నాను.

లాస్ట్ బట్ నాట్ లీస్ట్ అన్న ఆర్యోక్తి లాగా చివరిఘట్టంలో నా ఈ నాటకానికి "ఉషోదయము" అందించినవారు డా॥ వారణాసి వీరనారాయణ శర్మ గారు. వీరి "శ్రీ పారిజాతము" నా నాటక ప్రూఫు దిద్దుటకు నిలయమై నాపాలిటి మనఃపారిజాతమై విలసిల్లినది. పుస్తక ముద్రణపట్ల శర్మగారి అనురక్తి అనుపమానము. రచయితనైననా బాధ్యత, ముద్రాపకులైన పులిశేషయ్యగారి బాధ్యత మొత్తం తనపైనే వేసుకొని ఉత్తమోత్తమంగా ప్రూఫుచూచుటేగాక అనేక పర్యాయాలు మమ్ముల్ని చైతన్యపరిచి ఈ నాటకం అతిస్వల్పకాలంలో ముద్రణ పూర్తియగుటకు ముఖ్యకారకులు. ప్రెస్ వారికి

మాకు సంధానకర్తలు, పాఠకుల హస్తాలలో ఈ పుస్తకం అందంగా అలరారుటకు సూచనలిచ్చిన సాహితీ మిత్రులు శ్రీ వారణాసి వీరనారాయణ శర్మగారికి నా హృదయపూర్వక నమస్కారములు.

అన్నింటిని మించి నా యీ అభ్యున్నతికి ప్రోత్సాహంగా నిలిచి తన సాహచర్యంతో నాలో ఉత్తేజాన్ని నింపి నాద్వారా జరుగుతున్న కష్టనష్టాలు భరిస్తూ ఎంతో ఓరిమి సహించి సహనంతో సహకరించిన నా అర్ధాంగి చి.ల.సౌ. సుజాతకు నా ప్రత్యేక అభినందనలు.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి అనతికాలంలో అందించిన పున్న చండికేశ్వర్, నల్ల సత్యనారాయణ, పార్థసారథి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నల్లగొండ ప్రెస్ యాజమాన్యానికి, వారి కార్యశీలురకు మరియు డి.టి.పి. చేసిన జెల్ల మురళీధర్‌కు నా పత్యేక అభినందనలు.

ముఖచిత్రం అందంగావేసి ఇచ్చిన శ్రీ కె. రవీంద్రాచారి, డ్రాయింగ్ మాస్టర్, జి.ప.ఉ.పా. కొండ్రపోల్ గారికి అభినందన మందారాలు.

ఈ నాటిక ముద్రణకు ఆర్థిక, హార్దిక సహకారం అందించిన వారికి నా కృతజ్ఞతలు.

ఇందులోని దోషములన్నీనావి. విశేషములన్నీ పరిష్కర్తలవి. ఇంకా ఈ నాటకం చదివినవారు ప్రదర్శించిన వారు వారివారి అభిప్రాయాలు, సద్విమర్శలూ అందిస్తే ఓదలదాల్పడానికి సంసిద్ధుడిని.

నా నాటిక రచనలో, ప్రదర్శనలో, ముద్రణలో సహకరించిన వారందరికీ, పేరుపేర్కొనక పోయినా, మరచిపోయినా అందరూ నన్ను మన్నిస్తారని ఆశిస్తూ నా నమస్కారములు, కృతజ్ఞతలు తెలియజేసుకొనుచున్నాను.

భవదీయ

తడకమళ్ళ రాంచందర్‌రావు

## "ఉషా పరిణయం" నాటకం
## పరిషత్ ప్రదర్శనలలో పొందిన బహుమతులు

| | | |
|---|---|---|
| 1. | లక్ష్మీనృసింహ కళాపరిషత్<br>యాదగిరిగుట్ట 5-3-1995 | 1) ఉత్తమ రచన<br>2) ఉత్తమ ద్వితీయప్రదర్శన<br>3) ఉత్తమ విలన్ (బాణాసుర పాత్రధారి టి. రాంచందర్‌రావు) |
| 2. | వినుకొండ నాటక పరిషత్<br>అక్టోబర్ 1995 | 1) ఉత్తమ ద్వితీయ ప్రదర్శన<br>2) ఉత్తమ నటుడు (బాణాసుర పాత్రధారి టి. రాంచందర్‌రావు)<br>3) ఉత్తమ నటి (ఉష పాత్రధారి శ్రీమతి విజయఖాను)<br>4) ఉత్తమ దర్శకత్వం టి. రాంచర్‌రావు |
| 3. | ఎన్.టి.ఆర్. కళాపరిషత్<br>త్యాగరాయగానసభ, హైద్రాబాద్<br>28-5-1997 | 1) కన్సొలేషన్ ప్రదర్శనా జ్ఞాపిక |
| 4. | పౌరాణిక నాటక పోటీలు<br>రాజంపేట, కడప జిల్లా<br>ది. 11-6-1997 | 1) ఉత్తమ ద్వితీయ ప్రదర్శన<br>2) ఉత్తమ విలన్ (బాణాసుర పాత్రధారి టి. రాంచందర్‌రావు)<br>3) ఉత్తమ హాస్య నటులు - కాలాక్షుడు పాత్రధారి జి. సాయిలు |
| 5. | పౌరాణిక నాటక పోటీలు<br>ప్రొద్దుటూరు, కడపజిల్లా<br>ది. 4-8-1997 | 1) ఉత్తమ విలన్ కన్సొలేషన్ బాణాసుర పాత్ర టి. రాంచందర్‌రావు<br>2) ఉత్తమ నటుడు - శ్రీకృష్ణ పాత్ర సోమా అంజిరెడ్డి |
| 6. | 2000-నంది అవార్డు పోటీలు<br>రవీంద్రభారతి, హైదరాబాద్<br>21-5-2001 | 1) ఉత్తమ విలన్ నంది అవార్డు బాణాసుర పాత్ర - టి. రాంచందర్‌రావు<br>2) ఉత్తమ రంగాలంకరణ సురభి డ్రస్ & మేకప్, భానోజీరావు, గుంటూరు |

## "ఉషా పరిణయం" నాటకం ఇతర ప్రదర్శనలు

### ఆర్.టి.సి. ఆర్ట్సుకో మిర్యాలగూడ వారిచే. నటరాజ నాట్యమండలి ద్వారా

7. ఆర్.టి.సి. బస్‌స్టాండ్, మిర్యాలగూడ - శ్రీరామనవమి .................... 1994
8. తుమ్మడం గ్రామంలో సహాయ ప్రదర్శన ........................................ 1994
9. ఆర్.టి.సి. బస్టాండ్, మిర్యాలగూడ శ్రీరామనవమి ............................ 1999

### "ఉషా పరిణయం" మిర్యాలగూడ సాంస్కృతిక కళాకేంద్రంచే

10 బాలవిహార్ స్కూల్, మిర్యాలగూడ ........................................ మే 1994
11. పైలాన్ & నాగార్జునసాగర్.................................................. 31-7-1994
12. పటేల్ క్లబ్, మిర్యాలగూడ (స్పాట్స్ ప్రదర్శన) ........................ 23-2-1995
13 దక్కన్ సిమెంట్స్ లిమిటెడ్, జానపాడు ...................... ........ ఏప్రిల్ 1995
14. రామాలయం, పేదొటుపల్లి, గన్నవరం, విజయవాడవద్ద ....... 11-4-1995
15. లక్ష్మీనృసింహదేవస్థానం, మట్టపల్లి ................................ ....... 1-1-1996
16. హనుమంతరాయ గ్రంథాలయం, విజయవాడ............ ... .... 5-1-1996
17. మద్యనిషేధ ఉత్సవాలు, సాకేత జూనియర్ కళాశాల, మిర్యాలగూడ 16-1-96
18. శ్రీరామనవమి - రెడ్డి కాలనీ, మిర్యాలగూడ........................ ఏప్రిల్ 1996
19. శ్రీరామనవమి - మెయిన్‌బజార్, మిర్యాలగూడ.................. ఏప్రిల్ 1996
20. గణేష్ ఉత్సవాలు - నేరెడుచర్ల ........................................ సెప్టెంబర్ 1996
21. శివాలయం - మేళ్ళచెర్వు....... ................................................ 9-3-1997
22. లయన్స్ క్లబ్, మిర్యాలగూడ (స్పాట్స్ ప్రదర్శన) ..................... 3-4-1997
23. శ్రీరామనవమి - సీతారాంపురం, మిర్యాలగూడ .................... 17-4-1997
24. శివాలయం - సింగరాయపాలెం, కృష్ణా జిల్లా ...................... ఏప్రిల్ 1997
25. దసరా నవరాత్రులు, అడవిదేవులపల్లి .................................. 8-10-1997
26. బాలల దినోత్సవం, యం.డి.ఓ. ఆఫీస్, మిర్యాలగూడ ......... 14-11-1997
27. గీతా మందిరం, నకిరేకల్ ....... ......................... .. ........ .. ..... 4-2-1998
28. శివాలయం, నార్కట్‌పల్లి ........................................................ 25-2-1998
29. రవీంద్రభారతి - నాటకోత్సవం - హైద్రాబాద్ ............. ......... 7-10-1998
30. క్యాంప్ స్కూల్, మిర్యాలగూడ (స్పాట్స్ ప్రదర్శన)................. 9-5-1999
31. గ్రా.పం.రాజవరం, మం॥ అనుముల .................................... 23-6-1999
32. శివాలయం, చెర్వుగట్టు, మం॥ నార్కట్‌పల్లి ........................... 31-1-2001
33. శివాలయం, పేరూరు, మం॥ అనుముల ............................. 20-2-2001
34. పటేల్ క్లబ్, మిర్యాలగూడ (స్పాట్స్ ప్రదర్శన) ....................... 3-5-2001

"ఉషాపరిణయం" భరజలకళాసమితి, అశ్వాపురం, మణుగూర్‌వద్దవారి ప్రదర్శనలు

35. హెచ్.డబ్ల్యు.పి. పి యం. కాలనీ అశ్వాపురం ........... . .......... 12-1-1996
36. అయ్యప్ప దేవస్థానం, భద్రాచలం .... ...................... .......... 14-1-1996
37. గణపతి మహోత్సవాలు, బండారు గూడెం................ .. ...... 18-9-1996
38. గణపతి మహోత్సవాలు, భద్రాచలం .......... ......... . .. .........20-9-1996
39. ముత్యాలమ్మ జాతర, దుమ్ముగూడెం.... ... ........ . .. ........25-5-1997
40. దసరా ఉత్సవాలు, పాల్వంచ.... ....... .. ........ ......... ... .. 23-10-1997
41. పెద్దమ్మగుడి జాతర, పాల్వంచ ....... . ... .. .............. ..... 25-10-1997
42. శ్రీరామ దేవస్థానం, భద్రాచలం ............ ........ ............ .. 16-12-1997
43. గణపతి నవరాత్రులు, బండారిగూడెం ... ............ ... .......... . 21-9-1998
44. గణపతి నవరాత్రులు, భద్రాచలం ......... ............................23-9-1998
45. శివాలయం, శివలింగాపురం, మణుగూరు........................ . 4-3-2000
46. అశ్వాపురం, స్ప్యూట్నీ ప్రదర్శన ..........................................17-3-2000
47. వెంకటేశ్వర కళా పరిషత్, తిరుపతి .......................................11-2-2001

శ్రీ సద్గురు త్యాగరాజ నాట్యకళామండలి ద్వారా ప్రదర్శనలు

48. పద్మావతి కాలనీ, నల్లగొండ ............................... ....... సెప్టెంబర్ 1994
49. వినాయకనగర్, మిర్యాలగూడ ....... .. ........... ............ సెప్టెంబర్ 1994
50. జి.ప. ఉన్నత పాఠశాల, కొండ్రపోలు..... ... ....... ......................5-3-1997
51. ఆకాశవాణి, హైద్రాబాద్ రేడియో ప్రదర్శన.... .......................30-5-2001

## 'ఉషాపరిణయం' ప్రదర్శించిన సమాజాలు - నటీనటులు

1) ఆర్టీకో - ఆర్టీసి మిర్యాలగూడ మరియు నటరాజనాట్యమండలి

1) నారదుడు - పట్టాభిరాందాస్
2) శంకరుడు - డి. వేంకటేశ్వరరావు
3) బాణాసురుడు - టి. రాంచందర్‌రావు
4) కాలాక్షుడు - బంగారు, ఏ. మల్లయ్య
5) చిత్రరేఖ - జయలక్ష్మి, విజయలక్ష్మి, నందిగామ
6) ఉష - నందిగామ విజయలక్ష్మి, విజయభాను,నర్సరావుపేట ఏ. ప్రభావతి
7) అనిరుద్ధుడు - యం. లక్ష్మయ్య, ఎస్ గురునాథం
8) కుంభాండుడు - నాయక్
9) శ్రీకృష్ణుడు - రంగనాయకులు, యం. దామోదరాచారి
10) బలరాముడు - యం.కోటిరెడ్డి, జి. సాయిలు
11) సాత్యకి - రాజు

*సంగీతం* - *శ్రీ రామమూర్తి, హార్మోనిస్ట్, పానుగంటి చంద్రశేఖర్*
*దర్శకత్వం* - *తడకమళ్ళ రాంచందర్‌రావు*

2) మిర్యాలగూడ సాంస్కృతిక కళాకేంద్రం, మిర్యాలగూడ

| | | |
|---|---|---|
| 1) | నారదుడు | - ఆర్. ప్రసాద్, పట్టాభిరాందాస్, పులిశేషయ్య, భైరవభట్ల సుబ్రహ్మణ్యశర్మ |
| 2) | శంకరుడు | - డి. వేంకటేశ్వరరావు |
| 3) | బాణాసురుడు | - టి. రాంచందర్‌రావు |
| 4) | కాలాక్షుడు | - సిహెచ్. లక్ష్మయ్య, జి. సాయిలు, వి.ఎస్.ఆర్. కృష్ణ |
| 5) | చిత్రరేఖ | - మీనాకుమారి, విజయలక్ష్మి, ఏ. ప్రభావతి, విజయశ్రీరెడ్డి, మంగకుమారి |
| 6) | ఉష | - విజయభాను, బుజ్జా సుబ్రహ్మణ్య శాస్త్రి |
| 7) | అనిరుద్ధుడు | - వీరనూరి జానకిరామశర్మ, ఆర్. ప్రసాద్ |
| 8) | కుంభాండుడు | - పులి శేషయ్య, బి. కామేశ్వరరావు, యం. రామనాథం |
| 9) | శ్రీకృష్ణుడు | - సోమా అంజిరెడ్డి, యం. లక్ష్మయ్య |
| 10) | బలరాముడు | - ఏ. మెహన్‌రావు, ముత్యం, పి. కృష్ణమూర్తి |
| 11) | సాత్యకి | - పి. రామావతారం, పి.లక్ష్మినారాయణశర్మ |
| 12) | భటులు | - సోమశేఖర శర్మ, గోపయ్య, శ్రీరాములు, యం.దామోదరాచారి, రామాచారి, మొదలగువారు. |
| | *సంగీతం* | *-- హార్మోణియం -పానుగంటి చంద్రశేఖర్* |
| | *తబల* | *-- ఏ. ఎల్. కాంతారావు* |
| | *క్లారినెట్* | *-- దాచేపల్లి నాగభూషణం* |
| | *దర్శకత్వం* | *-- తడకమళ్ళ రాంచందర్‌రావు (నంది అవార్డు పోటీలకు సాయిజి)* |

3) ఘారజల కళాసమితి, అశ్వాపురం

| | | |
|---|---|---|
| 1) | నారదుడు | - సిహెచ్. వి. రమణ |
| 2) | శంకరుడు | - మురళీధర రావు |
| 3) | బాణాసురుడు | - యం. వెంకటేశ్వర్లు |
| 4) | కాలాక్షుడు | - వి.ఎస్.ఆర్. కృష్ణ, సిహెచ్. లక్ష్మయ్య |
| 5) | చిత్రరేఖ | - మీనాకుమారి, అహల్య, పుష్పలత |
| 6) | ఉష | - విజయభాను, పద్మావతి, ఏ. ప్రభావతి |
| 7) | అనిరుద్ధుడు | - కె. గణపతి |
| 8) | కుంభాండుడు | - ఎ.యం.టి.ఎస్.పట్నాయక్, బి. కామేశ్వరరావు |
| 9) | శ్రీకృష్ణుడు | - కె. నాగయ్య, ఎస్. అంజిరెడ్డి, సిహెచ్. నాగముత్యం |
| 10) | బలరాముడు | - కె. నిరీక్షణరావు, పి. కృష్ణమూర్తి |
| 11) | సాత్యకి | - పి. రఘునాథ్, గోపీశేఖర్ |
| | *సంగీతం* | *- పానుగంటి చంద్రశేఖర్* |
| | *క్లారినెట్* | *- దాచేపల్లి నాగభూషణం, నాగులు మీరా* |
| | *దర్శకత్వం* | *- ఏ. శేషశాయి* |

4) శ్రీ సద్గురు త్యాగరాజ నాట్య కళాపరిషత్, మిర్యాలగూడ - రేడియో ప్రదర్శన

1) నారదుడు - పుల్లాభట్ల వేంకటరామశర్మ
2) శంకరుడు - పులి కృష్ణమూర్తి
3) బాణాసురుడు - తడకమళ్ళ రాంచందర్‌రావు
4) కాలాక్షుడు - పులి ప్రసాదశర్మ
5) రక్తాక్షుడు - యం. లక్ష్మయ్య
6) చిత్రరేఖ - ఏ. ప్రభావతి
7) ఉష - విజయభాను
8) అనిరుద్ధుడు - వీరసూరి జానకిరామశర్మ
9) కుంభాండుడు - మూరావర్జుల రామనాథం
10) శ్రీకృష్ణుడు - పులిశేషయ్య
11) బలరాముడు - సాయిజీ
12) సాత్యకి - పుల్లాభట్ల లక్ష్మీనారాయణశర్మ
13) ప్రద్యుమ్నుడు - యడవల్లి రఘురామయ్య
14) భటుడు - గంధంకోటి సోమశేఖర శర్మ

*సంగీతం - హార్మోనియం : పామగంటి చంద్రశేఖర్*
*తబలా,మృదంగం - ఏ. ఎల్. కాంతారావు*
*క్లారినెట్ - దాచేపల్లి నాగభూషణం*
*దర్శకత్వం - తడకమళ్ళ రాంచందర్‌రావు*
*నిర్వహణ - పులి శేషయ్య*
*పర్యవేక్షణ - పుల్లాభట్ల కృష్ణమూర్తి శర్మ*
*ప్రయోక్త - వై. సరోజా నిర్మల, ఆకాశవాణి, హైద్రాబాద్*





2000 సంవత్సరపు "రంగస్థల నంది అవార్డు"ను ఉత్తమ విలన్‌గా ముఖ్యమంత్రిగారి నుండి అందుకుంటున్న బాణాసుర పాత్రధారి, రచయిత ఈడకమళ్ళ రాంచందర్‌రావు



"బాణాసుర" పాత్రలో రచయిత తడకమళ్ల రాంచందర్‌రావు



"బాణాసుర" పాత్రలో
రచయిత
తడకమళ్ల రాంచందర్‌రావు



మిర్యాలగూడ సాంస్కృతి కళాకేంద్రం ప్రదర్శించిన నాటక దృశ్యం

# ఉషాపరిణయం

## పాత్రలు

| | | |
|---|---|---|
| 1) | నారదుడు | : దేవర్షి |
| 2) | శంకరుడు | : భక్తవశంకరుడు |
| 3) | బాణాసురుడు | : శోణపురాధినాధుడు<br>రాక్షస సార్వభౌముడు |
| 4) | కాలాక్షుడు | : బాణుని భటుడు |
| 5) | చిత్రరేఖ | : మంత్రికుంభాండునికూతురు |
| 6) | ఉష | : బాణాసురుని కూతురు |
| 7) | అనిరుద్ధుడు | : శ్రీకృష్ణుని మనుమడు,<br>ప్రద్యుమ్నుని కుమారుడు |
| 8) | కుంభాండుడు | : బాణాసురుని మంత్రి |
| 9) | శ్రీకృష్ణుడు | : ద్వారకాధీశుడు |
| 10) | బలరాముడు | : కృష్ణుని అగ్రజుడు |
| 11) | సాత్యకి | : కృష్ణుని సోదరుడు |

ఇంకా నర్తకి, భటులు, వందిమాగదులు

# ఉషాపరిణయం

## ప్రథమాంకము - మొదటి రంగము

*(నారదుడు ఆకాశగమనమున ప్రవేశము)*

పాట

నార:- *భక్తజనావన పావన చరణా*
*పాలితముని గణ భవభయహరణా*
*పాలింపుము నను పంకజ నాభా*
*పరిపూరిత కరుణాలవాలా ॥ భక్తజనావన ॥*
*సృష్టి, స్థితి, లయ కార్యత్రయముల*
*మూలమునీవై ముమ్మూర్తులా*
*బ్రహ్మ, విష్ణు, పరమేశ్వర రూపా*
*ఆదిదేవా ఆత్మస్వరూపా ॥ భక్తజనావన ॥*
*దుష్టశిక్షణా, శిష్టరక్షణా*
*నెరవేర్చగ యుగయుగములందునా*
*అవతారంబుల నెన్నోదాల్చి*
*అలరారిన వైకుంఠ నివాసా॥ భక్తజనావన ॥*

నారాయణ! నారాయణ!! నిరంతరము ముల్లోకంబుల సంచరించుచు జగత్కల్యాణకరంబులగు కార్యముల చక్కబెట్టుచున్ననన్ను కలహాశనుండనని నిందింతురు గదా! పోనీ అటులనే తలంచినను స్వర్గ, మర్త్య, పాతాళములందెందేని కయ్యములేకరువైనవి. జలంధర, భస్మాసురాదిదానవులంతరించిన పిదప దేవదానవులకు యుద్ధములే లేవు. కానీ.. ఈ మధ్యకాలంబున బాణాసురుడను రాక్షసరాజు సహస్రబాహుబలౌద్ధత్యంబున విహరించుచున్నాడు. వీడు హరునకు భక్తుడు హరికి విరోధి... ఆ... ఇదే అదనుగా లోకకళ్యాణకరమగు కలహభోజనముతోపాటు శివకేశవుల అభేదము జగత్ప్రకాశమగుగాక.

ఉ॥ *శంకరుడో మురాంతకుడొ శక్తిని యుక్తిని మించువాడు ని*
*శ్శంక పరాక్రమించునది చక్రత్రిశూలములందు నేదియో?*
*రంకెలువేయునందియొ? పరాక్రమతేజుడు పక్షిరాజొ? ఏ*
*వంకను దేల్చ వారిజభవాదులె నేరరు నాకు సాధ్యమే?*

సాధ్యాసాధ్యవిషయ చర్చయేల? బాణాసురుగర్వభంగమైనను సాధింపగలనుగదా! అదిగో ఓంకారనాదము. ఆ స్వరము బాణునిది వలెనున్నది. వాడుశంకరుని మెప్పించి ఏ వంకర వరమో కోరక పోడు నేనును వెళ్ళిగాంచెద... నారాయణ... నారాయణ... (కీర్తనతో నిష్క్రమణ)

## ప్రథమాంకము - రెండవ రంగము

*(కైలాసాచలమున శంకరుడు ధ్యానముద్రలో నుండగా బాణాసురుడు పంచాక్షరీ మంత్రోపాసన చేస్తుండగా తెరలేస్తుంది. తర్వాత పాట - పల్లవి తర్వాత తాండవం - శంకరుడు)*

బాణా:- ఆడరా! తాండవంబాడరా! ఆడరా! తాండవంబాడరా!!
నటరాజ కైలాస గిరులు పులకింపగా
నీపాద మంజీర రవళి ప్రభవింపగా ॥ ఆడరా ॥
భవహస్త సంచలన భవ్య సంకేతమై
డమరుకృన్నాదమున భాష వికసింపగా
ప్రమథ గణ పరిసేవ్య ప్రభవకారణమై
మృదంగంబు లయతాళగతుల వెలయింపగా ॥ ఆడరా ॥
భవపాద ఘట్టనచె రజతాద్రి కందరం
దద్ధరిలిధనధనంధనయనంగ
తవతాండవంబుచే తారకల్రాలగా
దిశలెల్ల తళతళంతళయనంగ ॥ ఆడరా ॥
(పాట పూర్తియగు వరికి బాణుడు శంకరునికి నమస్కరిస్తూ, శంకరుడు బాణుని ఆశీర్వదిస్తూంటారు. తాండవం చేయలేని సందర్భంలో దీనినే డైలాగ్‌లావాడుకోవచ్చును.)

శంక:- భక్తా! బాణాసురా! సంగీత సాహిత్యంబుల నన్నలరింపజేసితివి... ఏదేని వరంబుకోరుకొమ్ము సంగెద.

బాణా:- భవహరా! పురహరా! నాకేమికోరిక గలదు స్వామీ! మీ కారుణ్యముచే లోకములెల్ల జయించి కీర్తినందితిని. సకల సౌభాగ్యములు పొందితిని. ఇంకేమి వాంఛింపగలను స్వామీ!

శంక:- బాణాసురా! సహస్ర బాహుబలోద్ధతుండవైన నీ కన్నియు సులభసాధ్యములే భక్తుడవైన నీ కోరిక తీర్చదలిచినాను. కాదనకుము.

బాణా:- (స్వగతం) అయాచితముగా శంకరుడొసంగు వరమునేల జారవిడువవలె? కైలాసము దక్క చతుర్దశ భువనములయందు నా వశముగాని చోటు లేదు. మరి యీ కైలాసమును గూడా నావశము గావించుకున్నచో....

శంక:- బాణాసురా! ఏమి? యింకనూ యోజించుచున్నాడవు?

బాణా:- ఏమీ లేదు స్వామీ! అవ్యాజకరుణాకటాక్ష వీక్షణుడవైన నీ రక్షణము. మాశోణపురమునకు పెట్టని కోటయగును గదా యని....

శంక:- దానికేమి? నా భక్తులకు నా రక్షణ ఎల్లప్పుడుండును. ముందు వరము కోరుకొనుము.

బాణా:- అదియే! అదియే నాకు వలయువరము... నిరంతర శత్రువధోత్సాహ సైన్యసంకులమై, భీకర మకర సంచలన కల్లోలిత పరిఖానమావృతమై, విషాత్త దంష్ట్రా పరిశోభిత క్రూర సర్ప సంచరణ ప్రదేశ పరివ్యాప్తమై, శత్రునిర్భేద్య సమున్నత ప్రాకార సంశోభితమై యలరారు మా శోణపురంబునకు ద్వారపాలకుడవై నగర రక్షగావించుచు భక్త వశంకరుడన్న కీర్తిని సార్థక పరచుకొనుము. ఇదియే నే కోరువరము.

శంక:- బాణాసురా! నీవు కోరుచున్న వరమేమో తెలియునా?

బాణా:- ఆ! తెలియును.... విశ్వవిశ్వాంతరాళమును తన ఫాలనేత్ర సంజనిత విస్ఫులింగ మాత్రమున భస్మీపటలముగావింపగల మేటి, సర్వంసహా జీవకోటిని క్రీగంటి సైగతో చరింపజేయగలదిట్ట, నర, సుర యక్ష, కిన్నర, కింపురుష విద్యాధరాఖిల ఖేచర సమూహములచే పాదపూజలందుకొను పరమశివుడు...... నా శోణపురద్వారపాలకుడుగావలె... కావలె చతుర్దశభువనములు నా అధీనము. అప్పుడు బాణాసురుడే ఆది దేవుడు, సృష్టి స్థితి లయములకధినాథుడు... (నవ్వు) శంకరా! నీ వొసంగెడి వరము... నీభక్తుని యశోమకుటమున రత్నద్యుతి... భక్తుని ఉన్నతినే కోరెదవో, అనృతమాడి అపకీర్తి నొందెదవో నీ యిష్టము.

శంక:- బాణాసురా! అనృతమాడవలసిన ఆవశ్యకతనాకు లేదు. భక్తుడవు గాన నీవు కోరుచున్న విపరీతవరమును గూర్చి విచారించుచున్నాను.

ఉ॥ ఎందరొదానవేంద్రులు తదేకపు భక్తితొ నన్ను గొల్చియున్
పొందియు నా వరంబులను ప్రాపును వైభవముల్ చెలంగగా
లొందర పాటుచే యిలను దోషము లెన్నియొ చేసిచేసిగో
విందుని మాయలన్ దవిలి వీడిరి ప్రాణము లీవెరుంగవే?

బాణా:- శంకరా! మీచే వరములందిన దానవులెందరో మడసిరనుట యథార్థమే! నేనిప్పుడు మృత్యుంజయుడను కావలెనని కోరుటలేదే! ఈ చతుర్దశభువనములు నా అధీనముగావలె అందుకు నీవు నాబంటువు గావలె. అప్పుడు మృత్యు జరాదులను నేనే శాసింపగలను... ఇక మీ దేవతల మాయలకు చిక్కి మడయుటకు నేను సామాన్యుడనుగాను హరా! సహస్రబాహుబల సంపన్నుడను.

శంక:- బాణాసురా! నీ సహస్ర బాహువులను నమ్మి పొంగిపోకుము

చం॥ అల కృతవీర్యపుత్రుడు సహస్రకరంబులనొప్పియుండియున్
జలజహితోదయాంచిత ప్రచండ ప్రభావిభవత్సమేతుడై
యలరి మహారణంబుల జయంబుల నెన్నియొ పొందివెల్గియున్
బలయుతుడై చెలంగియును భార్గవరామునిచేత ద్రుంచడే

బాణా:- నీలకంఠా! కార్తవీర్యార్జునుడు పరశురామునిచే పరాభూతుడుకావచ్చును. కానీ నాకట్టి స్థితి సంభవింపదు ఏలనందువా?

చం॥ గెలిచితి కిన్నరేంద్రు నురగేశుజయించితి నింద్రుదొట్టితిన్
బలమున దేవమానవుల బంటులజేసితి నెట్టినుంచితిన్
కలవర మొంద జేసితిని కానలసున్నమునీంద్రసంతతిన్
చెలగి మహోద్ధతిన్ వశుని జేసెద నిన్నిక నీలకంధరా!

శంక:- బాణాసురా! వృథా వాగ్వ్యయమేల మరొక వరంబేదేని కోరుకొనుము.

చం॥ మణిగణ కాంచనాది పరమాద్భుత ద్రవ్యపు మేలిరాసులో
ప్రణుత సమాదరంబులగు రత్నమయోన్నత హర్మ్యరాజియో
రణవిహితాస్త్ర శస్త్రముల రాసులతోడుత మంత్రబోధయో
ప్రణుతి గడింపగా పగరనొంచువరంబులొ కోరుమాయిటన్

బాణా:- ఫాలనేత్రా! వరమునొసంగు బాధ్యతయే నీది. వర నిర్ణయమునాది. భగవంతుడవైన నీవు వరంబు కోరమంటివి భక్తుడనైన నేను కోరుకొంటిని. పలుమాటలేల వరంబీయ నంగీకరింతువో కాదని అనృతాఘమునే మెడఱట్టు కొందువో విఘుడియలో విపులీకరింపుము..... ఆ!.. నీవు వరంబిచ్చిననూ యివ్వకున్ననూ నాకు తరుగునదేమియు లేదు... ఇంత వరకు శ్రీహరి యొక్కడే మాకాగర్భ శత్రువు... నేటి నుండి నిన్ను గూడా దానవ వంశశాత్రవునిగా భావింపవలసియుండును. నీవంత వరకు రానీయవనియే! నా నమ్మకము.

శంక:- బాణాసురా! నీ విపరీతమగు కోరికకచ్చెరువంది యట్లంటిని గాని వేరుగాదు సరియే! నీ యిచ్ఛవచ్చినట్లే కానిమ్ము. నేటి నుండి నేను మీ శోణపుర ద్వారపాలకుడనై నిన్నూ నీ నగరమునూ సర్వదా రక్షింతును.

బాణా:- ధన్యుడను స్వామీ ధన్యుడను.

శంక:- ఈ విషయము భవాని కెరింగించి వచ్చెద క్షణమాగుము.

బాణా:- అటులనే మీ అనుగ్రహమే నాకానందదాయకము.

(శంకరుడు లోనికేగును).

బాణా:- అహహహ! హహ! శంకరుడు... శంకరుడిక నా కింకరుడు. కైలాసాచలమిక నా క్రీడాచలము. ప్రమథాదులు నాకు వందిమాగధులు, సురగరుడోరగ కిన్నర కింపురుష విద్యాధరాఖిల ఖేచర సమూహంబులు నాకు ఊడిగము చేయు పరిచారకులు.... మరి మునిగణంబు.... ఆ! మునిగణంబు నాకు సౌఖశాయనికులు... అహహహ! సౌఖ శాయనికులు.

నారదు:- (ప్రవేశం) నారాయణ! నారాయణ!!

బాణా:- నారదా! నారాయణ నారాయణ గాదు ఇక నుండి బాణాసుర! బాణాసుర!! అనవలె. కైలాసముతో సహా సర్వలోకంబులు నా అధీనములు.

నార:- నారాయణ. . నారా.......

బాణా:- ఊ... మరల

నార:- ఆ... ఆ... అలవాటుపడిన నాలుక గదా... మారుటకు కొంత అభ్యాసమవసరము... బాణాసురా! కైలాసముపై గూడా దండెత్తి నీ వశముగావించు కొంటివా?

బాణా:- కైలాసము నావశమైనది. శక్తిచే గాదు భక్తిచే..

నార:- నా కంతయు అయోమయముగా నున్నది.

బాణా:- అవునులే నీకెప్పుడూ అయోమయముగానే యుండును. కలహనాటక సూత్రధారివి కదా! నీ ప్రమేయము లేకుండా కైలాసము నా వశమగుట నీకు కంటగింపుకాబోలు....

నార:- అహహ అదిగాదు! కైలాసమెట్లు నీ వశమైనదాయని....

బాణా:- నీ సందేహము... నా సంగీత సాహిత్యములచే శంకరుని మెప్పించి వరము పొందితిని. ఆవరమేదియో తెలియునా? నా శోణపురద్వారపాలకుడుగా శంకరుడుండుట. ఆ శంకరుడే నాకింకరుడైనప్పుడు అతను, అతని కైలాసము, దీనితో పాటు చతుర్దశ భువనములన్నియు నా అధీనములే గదా! ఇక సర్వజగన్నియామకుండను నేనే... అహహ!....

నార:- అనుకున్నంతా అయినది... వీడు వంకరవరమునే కోరినాడు. అది అంకురమై, మహావృక్షమై, శాఖోపశాఖలుగా పరిఢవిల్లి ఫలవంతమగునట్లు కృషియొనర్చెద.

బాణా:- ఏమినారదా! ఏమి యోజించుచున్నాడవు.

నార:- ఏమియులేదు... నీ యుక్తికి అబ్బురపడుచున్నాను.

ఉ॥ *సైనిక సంకులం బకట సాగకనీక రణంబులేక న*
*మ్మానిత భక్తిచే శివుని మానసమున్ వశపర్చుకొంచు నీ*
*మానస మందు గల్గు పరమాద్భుత కాంక్షను తీర్చుకొంటివో*
*మానధనా వివేకయుతమార్గమునన్ చరియించుమా యికన్*

శంక:- (ప్రవేశిస్తూ) ఎవరూ? నారదమహర్షియా!

నార:- నమః పార్వతీపతయే హర హర మహదేవ

శంక:- ఏమి నారదా నను గాంచిన నీకును అపహాస్యముగా నున్నదా?

నార:- నారాయణ! నారా!... అ... అదేమి ఆదిదేవా? .... భక్తవశంకరుడవైన నీ భక్తరక్షణ దీక్షా పరత్వంబున కానందమొందుచున్నాడను.

గీ॥ *ఆత్మలింగము నిచ్చిన యపర శక్తి*
*భస్మహస్తము నొసగిన భవ్యకీర్తి*
*దక్షు గర్వంబు బాపిన దైవయుక్తి*
*బాణునకు బంటువైతివె భక్తిమూర్తి*

బాణా:- నారదా! నీ ప్రశంసలు తరువాత! మేము మా పురమున కేగవలె సెలవా మరి....

నార:- అవశ్యము. ఈ క్షణమున మిమ్మాపగలవాడెవ్వడు.

బాణా:- బాగుబాగు! శంకరా ఇకనన్ననుసరింపుము (వెళ్ళును).

నార:- (పరమేశ్వరుడు పోబోవు చుండగా) పరమేశ్వరా!

శంక:- (ఆగి) నారదా!

నార:- స్థిరముగా అచ్చటనే ఉండదలంచితిరా లేక దానవుని గర్వమడంప ఏదేని మార్గము వెదుకమందురా!

శంక:- నారదా! జగత్కల్యాణ కాంక్షివి నీవున్నావు గదా! బాణుని గర్వభంగమే నాకును విమోచనము.

నార:- నారాయణ! నారాయణ! మీరైననూ నన్ను జగత్కల్యాణ కాంక్షినని అంగీకరించితిరి సంతోషము. మీ ఆజ్ఞ అయినది. ఇక బాణుని భరతము పట్టు ఉపాయము నేనాలోచించెదను.

బాణా:- (తెరలో) శంకరా! ఏ మా యాలస్యము.

శంక:- అ... వచ్చుచున్నాను... వారదా మరికనేను...

నార:- వెళ్ళిరండు... నేనును జగజ్జననిని దర్శించి వెళ్ళెదను..

శంక:- సరియె.... (నిష్క్రమణ).

నార:- ఆహా! ఏమి ఈ భక్తవశంకరుని హృదయనైర్మల్యము అందుచేతనే అందరీతని బోళా శంకరుడందురు... హే ఆశ్రిత సులభా! ... (కీర్తన)...

<u>పాట</u>

*అదిదేవ రజితాచల మందిర*
*భక్త పోషణా నమోనమో*
*భవ వినాశనా నమో నమో॥ అది ॥*

*భక్తవశంకర భవహర పురహర*
*శార్దూలాంబర నమో నమో*
*నీలకంధరా, చంద్రశేఖరా*
*గంగాధర హర నమో నమో ॥ అది ॥*

*జటా జూట పరిశోభిత పన్నగ*
*నాగభూషణా నమో నమో*
*నిర్ఝరగంగాగభీర విజృంభణ*
*నిరోధకా హర నమోనమో ॥ అది ॥*

# ద్వితీయాంకము - మొదటి రంగము

*(బాణాసురునగరానికి అంతఃపురముఖద్వారం వెంత కాలాక్షుడు కాపున్నాడు)*

చిత్ర:- (ప్రవేశించి) ఇచ్చట కాలాక్షుడొక్కడే కాపున్నాడు. వీనిపై నాతుంభద్యోగ కామరూప విద్య ప్రయోగించి చూస్తాను. వీడినడిపి పెళ్ళాం గయ్యాళి - ఆరూపంతో వచ్చి వీడ్ని ఓ ఆటాడిస్తాను (వెంటనే లోనికెళుతుంది)

కాలా:- (అటూ ఇటూ తిరిగి)

<u>పాట</u>

*కాలయముని మించినోడు కాళికమ్మగొలిచెటోడు*
*కణకుకత్తిబట్టినోడు కాలాక్షుడు కాపున్నాడోయ్*
*బాణాసురు నగరానికి కాలాక్షుడు కాపున్నాడోయ్ ॥ కాలయముని ॥*

*చీమనైన దోమనైన చిన్నపోతు టీగనైన*
*నల్లినైన బల్లినైన మనిషినైన మానునైన*
*హద్దుదాటి పోనివ్వడోయ్ పోతే హతమారుస్తాడోయ్ ॥ కాలయముని ॥*

*పిల్లలు లేరని ముగ్గురు పెళ్ళాలను వేసుకొంటి*
*పిల్లలైతె పుట్టరాయె పీకులాట లెక్కువాయె*
*అందుకే ఇంటికైన పోకుండా ఇక్కడనే కాపున్నా ॥ కాల యముని ॥*

*ముగ్గురు పెళ్లాలతోటి మురిపెంగా ఉందమంటె*
*కళ్ళు మూసుకుంటె చాలుకలలో కరిచేస్తుంద్రు*
*పీకమీది కొస్తదని బిక్కుబిక్కు మంటున్నది ॥ కాల యముని ॥*

*(పాట పూర్తికాగానే చిత్ర తెరలో నుండే కాలాక్షుని భార్యలా వేషం ధరించి)*

చిత్ర:- (తెరలో) అవ్వ అవ్వ ఇదేం చోద్యం నాయినోయ్! ఈ మొగుడు మొద్దులుగాను, మూడురోజులనుండి ఇంటిముగం చూడనోడు వీడేంమొగుడు దేవుడోయ్!

కాలా:- అయ్యబాబోయ్! నా నడిపి పెళ్ళాం! ఇంకేముంది. ఇది నా పీక పిసకడానికే వస్తుంది. ఇపుడేం చెయ్యడం... ఆ... దీనిచేత ముక్కుపిండించుకోవడం కంటే ఆ మూలన దాచుకోవడమే మంచిది (దాచుకుంటాడు చిత్ర కాలాక్షుడి భార్య వేషంలో వస్తుంది).

చిత్ర:- ఏడీడు- ఎక్కడ సచ్చినావురా? మూడురోజుల్నుండి ఇంటికి రాకుండా అసలిక్కడేం చేస్తుండాని... (వెదకి చెవి పట్టిలాగును) ఏరా ఎత్తి మొగమా! నీ కేం మాయరోగమొచ్చిందిరా ఇక్కడదాక్కున్నావు.

కాలా:- ఆగవే!! అబ్బా ఆగవే! కొంచెం ఆగవే నా నడిపి పెళ్ళామా!

చిత్ర:- ఏరా! ఇంటికి రాకుండా ఇక్కడే ఉంటున్నావ్! నాలుగోదాన్నేమన్నా చూసుకున్నావా?

కాలా:- ఊ.. మీ ముగ్గురితోనే యేగలేక సత్తున్నా ఇంకా నా బతుక్కి నాలుగోది గూడానా... మన బాణా సుర ప్రభువు లేడూ...

చిత్ర:- ఆయనుంటేనేం లేకుంటేనేం - నీ ముగ్గురు పెళ్ళాలం మేమున్నామా లేదా? నువ్విట్టా ఇంటిముఖం చూడకుండా వుంటే మాగోడేంగావాలి, మా బాగేంగావాలి. అసలు మేమేం గావాలనుకున్నావ్!

కాలా:- అమ్మమ్మ ఆపవే నీ పంచాంగం

చిత్ర:- ఓరిసచ్చినోడ! పెళ్ళాన్ని పట్టుకొని అమ్మమ్మ అంటావేరా ఓర్నాయినోయ్! నా మొగుడ్నేదో పట్టింది. ఇంకనేనేం సేతును దేవుడోయ్ (ఏడుపు)

కాలా:- ఒసేవ్! ఆపవే! ఆపాడు ఏడుపు ఆపు! ఏదో పొరపాటున అన్నాను. నువ్వు నా పెళ్ళానివేలే... అసలు నువ్వు నన్ను మాట్లాడనిస్తేగా

చిత్ర:- ఇంకా నువ్వు మాట్లాడే దేంటంట? అంత చాతగాని వాడివి. ఒక పెళ్ళాముండగా నన్నెందుకు కట్టుకున్నావ్... పోనీ మేమిద్దర ముండగా మాకింకో సవితిముండనెందుకు తెచ్చావ్...

కాలా:- ఒసేయ్! ఒసేయ్! నేనింకా బతికే ఉన్నానే, నా చిన్న పెళ్ళాన్ని ముండా అనకు... అసలు దాన్నెవరన్నా ఏమన్నా అంటే నేనొప్పుకోను.

చిత్ర:- అబ్బబ్బ ఏంప్రేమ ఏంప్రేమ - అంటే నీకు చిన్న పెళ్ళాం మీదే మోజుందన్నమాట. అందుకే రాత్రి పూట ఇంటికి రాకుండా దొంగతనంగా యెల్లి రోజూ దాని దగ్గరే తొంగుంటున్నావన్నమాట

కాలా:- అసలు తొంగోటమెక్కడిదే, కళ్ళు మూసుకుంటే చాలు మూడు దయ్యాలు నా మీద పడి పీక్కుతింటున్నాయ్!

చిత్ర:- అంటే నిన్ను దయ్యాలు పట్టినయన్నమాట! ఓలమ్మో ఓర్నాయినో నా మొగున్ని దయ్యాలు పట్టినయట నేనేంసేతున్రా నాయినోయ్!(ఏడుపు)

కాలా:- ఆపవే! ఆపు! దయ్యాలంటే నిజంగా దయ్యాలు గావు. మీరు అంటే నా ముగ్గురు పెళ్ళాలన్నమాట.

చిత్ర:- ఏమిటి మేమా! ఓరి సచ్చినోడా! అంటే నీ కళ్ళకు మేందయ్యాల్లా కనిపిస్తున్నామా! నిన్నూ! నిన్ను సంపి నేనూ చస్తాను - (కొడ్తుంది) సావు! సావురా సచ్చినోడా సావు.

కాలా:- ఆగవే! కొట్టకు - ఆగవే (గట్టిగా ఆపి) ఏందే నీయవ్వారం ఇంతపెద్ద మొగోన్ని మొగతనమున్న మొనగాన్ని నన్ను నన్ను కొడతావా?

చిత్ర:- అబ్బో మొగతనమట మొగతనం, ముగ్గురు పెళ్ళాలను కట్టుకున్నా ఒక్క నలుసన్నా పుట్టకపాయె! నీ మొగతనం గురించి నాకు తెలీదా?

కాలా:- ఒసేయ్! ఒసేయ్! నా పరువు తీయకే... నీకు పుణ్యముంటది. చూడు ఎట్టాగో అట్టా మంత్రిగారికి మనవి చేసుకొని రేపటినుండి రాత్రి కాపలాకు బదులుగా పగటి కాపలా యేపించుకొని, చీకటి పడే సరికి నేరుగా నీ యింటికే వస్తాను.

చిత్ర:- చూస్తా! రాకపొయ్యావో నీయవ్వారం తేలుస్తా!

కాలా:- ఒసేయ్! ఒసేయ్! నీ ఆటాపాటా బాగుంటుంది. ఓసారి పాడవే.

చిత్ర:- ఇంటిముఖం చూడవుగానీ, ఆటపాటలు కావాలా.

కాలా:- వస్తానన్నానుగదే! ఒక పాట.... ఒకపాట..

చిత్ర:- సరే (పాటపాడును)

*నా నాట్య విన్యాసమూ సురభామలకు సాధ్యమా ॥ నా నాట్య ॥*
*నేత్ర సంచలనంబు మెఱువు దీవెలనీన -*
*ముఖ భంగిమలు చంద్రకాంతులు వెదజల్ల*
*మేనిమవ్వముసుమసౌరభము ప్రసరింప -*
*నా హాసమే సుందర లాస్యమూ ॥ నా నాట్య ॥*
*హస్తవిన్యాసాలు రక్తి నిక్షేపాలు*
*అభినయరీతులలంకార చిత్రాలు*
*పదగతులూ తాళలయ విన్యాసాలు -*
*నా గానమే అమర నాదమూ ॥ నా నాట్య ॥*
*(పాట విని మైమరచి ఎగురుతుంటాడూ)*

చిత్ర:- నా కామరూప విద్యా ప్రభావము చక్కగా పనిచేసింది. వాడు మైకంలో ఉండగానే ఉషవద్దకు వెళ్ళెదను.

// లైట్స్ ఆఫ్ //

# ద్వితీయాంకము - రెండవరంగము

*(అంతఃపుర ఉద్యానవనంలో ఉష - పాట)*

ఉష:- *బాలనురా మదనా నే-తాళను నీవేదనా*
*ఒంటరిగా నేనుంటను గాంచీ*
*తుంటరివై పూములుకులునాటిన*
*తాళనురా మదనా - నే తాళను నీవేదనా ॥ బాలనురా ॥*
*స్వప్నమందు నేగాంచిన పురుషుడు*
*మరల మరల నామదిలో మెదలగ*
*పంచ బాణముల నీవు మోదగా*
*తాళనురా మదనా నే - తాళను నీవేదనా ॥ బాలనురా ॥*
*మలయ మారుతము గాత్రము సోక*
*పున్నమి చంద్రుడు పులకింతగలిగింప*
*గండు కోయిలలు హృదయము మీటగ*
*తాళనురా మదనానే - తాళను నీవేదనా ॥ బాలనురా ॥*
(పాట పూర్తి చేసి అదేధ్యానలో మునిగిపోతుంది)

చిత్ర:- (ప్రవేశించి) యువరాణీ! .... యువరాణీ! (చెలిదగ్గరకేగి) యువరాణీ!

ఉష:- (ఉలిక్కిపడి) అబ్బబ్బ... ఏమిటే నీ ఆగడమూ?

చిత్ర:- బాగుబాగు! నాదా ఆగడము... పలుమార్లు పిలిచినా వినిపించుకొనక పరాకుగా నున్న నీదా....

ఉష:- ఏమేమీ పలుమార్లు పిలిచితివా?

చిత్ర:- అయితే నేవిన్నది నిజమేనన్నమాట.

ఉష:- ఏమది?

చిత్ర:- నీవు చింతలో ఏవేవో పలువరిస్తున్నావనీ, పరాకుగానున్నావనీ...

ఉష:- చాలు ఆపవే నీ మాటలు. చూడు నేనిప్పుడు బాగుగాలేనా?

చిత్ర: అలేకేమి? ఆ కలువకన్నులలో నిరీక్షణ, ఆ నిట్టూర్పులలో ఆవేదన, ఆ కెమ్మోవిపై కంపము, ఆ చెక్కిలిపై కెంపులు.....

ఉష:- చాలింపవే నీ పరిహాసోక్తులు.

చిత్ర:- ఏమిటేకింకా కప్పి పుచ్చెదవు.

ఉ॥ *బాలరొ సిగ్గునన్ వదన పద్మమదేటికి వాలిపోయె నీ*
*లీలకృశించినన్ మెఱుపు లీనుచుకాయమదేలదోచెనో*
*జాలమదేల తెల్పుమిక చానరొ నీమదినున్న కోరికన్*
*మేలగునట్లుగా నది నిమేషములో యొనగూర్చెదన్ సఖీ!*

ఉష:- చెలీ! ఇంక నా మనసు నావలేనే - ప్రాణసఖివైన నీకు గాక ఇంకెరి కెరిగించుకోగలను.... గాఢ నిద్రా పరవశనైయున్ననన్ను స్వప్నమునందొక సుందరాంగుడు వలువిధముల లాలించి శృంగార కేళి తేలించి మురిపించినాడు.. మేల్కాంచి చూతును గదా.. అదికల... అప్పటి నుండి మనసు మనసున లేదే...

చిత్ర:- స్వప్నముగనియా ఇంత బేలవైనావు

ఉష:- అది స్వప్నము వలె లేదే.... స్వప్నావస్థలో నన్నలరించి లాలించి ముద్దుల గురియించిన సుందరుడు నా మనసున ముద్రవేసివాడే

చిత్ర:- అమ్మకచెల్ల! అతిలోక సౌందర్యరాశియైన ఉషాకన్యనే మైమరపించిన ఆ స్వప్నసుందరుడు ఎంతటి అందగాడో...

ఉష:- చెలీ వాని అందము వర్ణింపనలవిగాదే...

చం॥ *కలువల సోయగంబుల వికాసము మీరిన సోగకండ్లు మే*
*నలరు సువర్ణఛాయ మదినానెడు నాసికసొంపు మోముపై*
*నలరు మిటారమింపొలుకు హాసము బాహు విశాల వక్షమున్*
*కొలదియెలేదు తా శతమఖుండొ జయంతుడొ కంతుడో సఖీ!*

చిత్ర:- ఆహా!

ఉష:- వానినాకన్నుల జూపి జీవంబులు నిలుపుము... నా మీద ఒట్టు సుమా

చిత్ర:- అంత మాటెందుకమ్మా! ఈ సృష్టిలోని అతి సుందరుల చిత్రపటాలు ఇంద్రజాలవిద్యతో చిత్రించెదను. వానిలో నీమనోహరుడెవ్వడో గుర్తింతువా?

ఉష:- తప్పక... త్వరగా కావింపుము.

చిత్ర:- క్షణమాగుము. పటములను ఏకాంతముగా చిత్రింపవలె. (లోనికేగి కొన్ని చిత్రపటములతో వచ్చి - చూపుతూ)

చిత్ర:- చెలీ చూడుము. వీరు గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, విద్యాధర, సిద్ధ, సాధ్య, యక్ష, రక్షో భుజంగ గుహ్యకులు.... వరుసగా ఒక్కొక్కరి పట్ల నీ కటాక్షాంచలాల ప్రసరిస్తే నీ మనోహరుడుదొరుకునేమొ?

ఉష:- (చూసి) ఊహూ! వీరెవ్వరూ కారే

చిత్ర:- సరియే! నరలోకంలోని అందగాళ్ళను చూడుము.

గీ॥ రాజ రాజును గాంచుమా రమణి యిపుడు
దానకర్ణుని తిలకించు తరుణి యింక
పాండు మధ్యము చూడుమా పడతి నీవు
కృష్ణస్వామిని దర్శించు కృష్ణవేణి

ఉష:- (అందరినీ కాదని కృష్ణుని చూచి) పోలిక కనుపట్టుచున్నది. కానీ రంగు యిది కాదే -

చిత్ర:- పోలిక దొరికినదా! అనంగుడైన మదనుడు శ్రీకృష్ణునకు నందనుడుగా జనించినాడు. ఇదిగో చూడుము ప్రద్యుమ్నుడు.

ఉష:- (చూసి) ఊ... ఇతని లానే కనిపించుచున్నాడు... కానీ ఇతడూకాడే ఆ చూపు... ఆ రూపు... ఆ ఠీవియే వేరు.

చిత్ర:- అయితే ఇక చిక్కినట్లే... వీనిగాంచుము....

ఉ॥ అందము నందున న్నల, జయంతుల మీరెడి సుందరాంగుడా
చందురుడాదిగా మదన సైన్యము గల్గిన శంబరారికిన్
పొందుగనందనుండగును పోలిక చూడుము, కృష్ణస్వామిదౌ
చందము గాన నయ్యెడు నుషా యిక యీ యనిరుద్ధు చూడుమా

ఉష:- (పటము చూడగానే గుంజుకొని ఆనందముగా పరువెత్తుచూ)

ఉ॥ కోమలి వీడెసుమ్మి నను కోరిన వాడలస్వప్నమందు ఓ
భామరొ వీడె సుమ్మి తన బాహువులందున నన్ను దాచె ఓ
లేమరొ వీడె సుమ్మి మది లెక్కకు మిక్కిలి సొక్క జేసె ఓ
రామరొ వీడె సుమ్మి యలరారెడు నా హృదయంబునందునన్.

చిత్ర:- (ఊహాలోకంలో నున్న ఉషతో) చెలీ! చెలీ! సరిసరి ఇకమేము కనిపించము కాబోలు.

ఉష:- (ఉలికిపడి) అటులనకే... నీ ఋణము తీర్చుకొనగలనా?

చిత్ర:- ఋణముల మాటెందుకు? నీ మనోహరుని రూపు జూచుచు మైమరచిపొమ్ము... నేను వెళ్ళెదను.

ఉష:- ఎచ్చటికి వెళ్ళెదవు ఈ సుందరాంగునిటకు జేర్చి మా సఖ్యత గూర్చవలసిన దానవునీవే...

చిత్ర:- ఏదో చిత్రపటమునంటే ఇంద్రజాలమున తేగలిగితిని కానీ ఆ సుందరాంగునెట్లు తేగలనమ్మా

ఉష:- నీ శుంభద్యోగ కామరూప విద్యల ద్వారా సాధించి తెమ్ము.

చిత్ర:- అమ్మో! అదిద్వారక సకలమాయల సారమెరిగిన శ్రీకృష్ణపరమాత్మ యున్నాడు. అచ్చట నాగారడీ సాగుతుందా?

ఉష:- మ॥ చెలియా యేటికి మాటలింక వినుమా చిత్తంబునేనోపలేన్
*కలికీ వానిని గూడు భాగ్యమిడుమీ కాదంచు వాదింపకన్*
*లలనా సాధ్యము గాని చోమనగనేలా ప్రాణముల్ బాయుదున్*
*జలజాతానను మ్రొక్కుచున్ మరల నా జన్మంబునన్ గూర్పగన్*

చిత్ర:- అంత మాటెందుకమ్మా నీ ప్రాణ సఖిని నేనుండగా నీకంతబాధ రానిత్తునా? ఇదిగో క్షణంలో నా శక్తి యుక్తులు చూపి అనిరుద్ధుని నీశయ్యామందిరములో ఉంచుతాను. సరేనా?

ఉష:- నీపై పరిపూర్ణ విశ్వాసముండుట చేతనే కోరితిని.

చిత్ర:- నీవు కళ్ళు మూసుకొని అనిరుద్ధుణ్ణి ధ్యానిస్తూ ఉండుము. కళ్ళు తెలిచేసరికి నీ ప్రియుడు నీ ముందుంటాడు. (నిష్క్రమణ)

ఉష:- ఉ॥ దేవతలార నా హృదయదేవుని తెచ్చుటకేగుచున్న నా
*పావన స్నేహశీలి నెద బాయక రక్షణ సేయుచుండుడీ*
*భావజు బారి నుండి యెడబాయు నుపాయము నాకిదొక్కటే*
*నా వెత దీర్చుడింక కరుణామయులార నమస్కరించెదన్*

చిత్ర:- చెలీ.... చెలీ... (ప్రవేశము)

ఉష:- (ఉలికిపడి) ఏడే... ఏడే... ఆ అందగాడు

చిత్ర:- అబ్బా తాళవమ్మా! నీ మనోహరుని నీశయనమందిరముజేర్చి...

ఉష:- శయనమందిరమునకా... (పోబోగా)

చిత్ర:- (ఆపి) ఆ.. ఆ.. అంతతొందరేల ... అతను నిద్రావశుడై యున్నాడు. నామాయా ప్రభావముచే కొద్ది క్షణములలో మేల్కాంచగలడు. జాగ్రత్తగా జూచుకొనుము.. రసాభాసకానివ్వకు సుమా!

ఉష:- అదేమే.... నీవు రావా?

చిత్ర:- ఏమి ప్రియురాలవమ్మా? పానకంలో పుడకలా మీ మధ్య నేనెందుకు... నేనిచ్చటనే విహరించుచుందును. వ్యవహారమేమైనా బెడిసినచో నన్ను పిలువుము. లేనిచో.... నీవే....

ఉష:- ఛీ... పోవే.... (పరువెత్తును)

* * *

# ద్వితీయాంకము - మూడవ రంగము

*(శయ్యపై అనిరుద్ధుడుండగా ఉషవేగముగా వచ్చి ఆగి దగ్గరకు వెళ్ళి, జరిగి)*

ఉష:- అహా! ఏమి యీజగన్మోహనాకారము - ఈ అందగాడు నా సొంతమగునా?

ఉ॥ *నిద్దుర లేపనా! తెలిసి నిల్వక నన్విడి పోవునేమొ? ఓ*
*ముద్దిడజూతునా! తమిని మున్గిన తెంపరినంచు నెంచడా?*
*హద్దులికేల కౌగిలిని హత్తన! ఛీ యిక సిగ్గు మాయు, మా*
*యిద్దర మొద్దు నిద్దరయునేచెడి తాపము గూర్చెదైవమున్*

అని:- (చలనం... మెల్లగా లేచికనులు నులుముకొని చుట్టూ చూస్తూ) ఏమిటి? ఎవరిదీ మందిరము? నేనెచ్చటనున్నాను?

ఉష:- మీరిచ్చటనే... (వాక్యం పూర్తిగాకముందే ఇద్దరి చూపులు కలుస్తాయి)

అని:- ఏమాకలస్వనము... కోయిల కొఱతయే సుమా!

ఉష:- ఆహా! ఈ దివ్యమూర్తి ఎంత తేజోవంతము!

అని:- ఇది సౌందర్యమా? సకల కళా సమాహారమా?

ఉష:- ఏమి ఆ కన్నులలోని ఆకర్షణ?

అని:- ఈ జవ్వని ఎవ్వతెయో? పలుకరించిచూచెద సుందరీ! .... సుందరీ!

ఉ॥ *ఎవ్వరిదానవే మదమృగేక్షణ? ఎయ్యదినీపురంబు? మే*
*మెవ్వరిగాదలంచితివి? ఎయ్యది నీదగునామధేయమున్?*
*ఎవ్వరిచేత తేబడితి మేమరుపాటుననుండగా యిటుల్?*
*నివ్వటిలంగనేల? మదినేటికి దాచెదు పాటలాధరా?*

ఉష:- సుందరా!

ఉ॥ *శోణ పురంబునం బరమశోభను మీరిన మందిరం బిదే*
*బాణుని ముద్దుపట్టినుష భావజుకేళిని స్వప్నమందు మీ*
*ప్రాణములోన ప్రాణమయి, ప్రావును పొందగ గోరి నా సఖీ*
*జాణ తనంబుతో నిటకు సాదరరీతిని మిమ్ముదెచ్చితిన్*

అని:- (ఆశ్చర్యంగా) ఏమేమీ! నను మోహించి తెప్పించితివా?

గీ॥ కాంతనీవన్యకాంతవా? కన్యవౌదా?
క్షత్రియుండనే రాక్షస కన్య వీవు
ఇతర జాతుల గూడగ నీప్సితంబె?
బాల యీలీల ననుగోర భావ్యమగునె?

ఉష:- ప్రియా! జాతి భేదములనతిక్రమించి పూర్వమునుండీ ఎందరు ప్రేమికులు వర్తిల్లలేదు? నేను కన్యనే గాని అన్యకాంతను గాను. నన్ను చేపట్టుము.

అని:- బాలా! మీదానవ వంశమునకును మాకును బద్ధవైరమున్నది గదా! మన వివాహమునకు నీజనకుడంగీకరింపడు. ఇది అసంభవము.

ఉష:- మనోహరా! పంచప్రాణములు నీపై నుంచుకొనిన నన్నేలనలయించెదు? నీకునాపై నిజమగుననురాగము లేకున్నపోనిమ్ము, మిమ్ముగాంచినదే భాగ్యముగా భావించి మరుజన్మలోనైనా మిమ్ము నాభర్తగా జేయుమని భగవంతుని ప్రార్థిస్తూ మీ పదములచెంత జీవములు బాసెద... (పాదములబడును).

అని:- (ఉషను లేపి) బాలా నీ మనోబలము నెరుగుటకట్లంటిని.

గీ॥ *ప్రథమ వీక్షణ మందునె పడతినేను*
*నీకు వశుడనై పోతినో నీరజాక్షి*
*రమ్ము గాంధర్వ పద్ధతి రమణి నిన్ను*
*పెండ్లి యాడెద నిప్పుడే ప్రేమ మీర*
(చేతులు చాపగా ఉష కౌగిట్లో చేరుతుంది)

///

# తృతీయాంకము - మొదటి రంగము

*(బాణాసురుని సభా భవనములోనికి కుంభాండ, కాలాక్షుల ఆహ్వానముతో వందిమాగధుల కైవారములతో బాణాసురుడు ప్రవేశం)*

వంది:- జయహో! రాక్షస సామ్రాజ్య విస్తరణ ధురీణా! జయహో! అసురలోక వందితా జయహో! సురలోక మర్దనా జయహో! దేవతాదాస్య గ్రహణ పారీణా జయహో! దిక్పాలక సేవిత పాదపంకేరుహా జయహో! శ్రీశ్రీశ్రీ బాణాసుర సార్వభౌమా జయహో! జయహో!! జయహో!!!

బాణా:- (సింహాసనము సమీపించి) హసాదు! అసురనాయకులారా హసాదు! అందరూ తమ తమ స్థానముల నాసీనులు కండు (తానూ కూర్చొని) మంత్రి వర్యా! రాజ్యమెట్లున్నది?

కుంభా:- రాజ్యమునకేమి ప్రభూ! నిత్యకళ్యాణము పచ్చతోరణముగా నున్నది.

బాణా:- ప్రభుభక్తి పరాయణులగు మీరందరుండగా ఇంకెందుకట్లుండదు? ఆ.. కాలాక్షా! నగర రక్షణము అంతఃపురరక్షణము సక్రమముగా నిర్వర్తింప బడుచున్నదా?

కాలా:- మీ పేరువింటేనే శత్రువులగుండెలు పగిలిపోతుంటే మన నగరానికెవరొస్తారు ప్రభూ! అయినా

గీ॥ మీదు నాజ్ఞను సుంతైన మీరకుండ
రాత్రి పగలనకుండగ రాజ్యమందు
ద్వారములనన్ని కాపాడి ధాటిగాను
అంతిపురపుద్వారముననే నమరినాను.

బాణా:- కాలాక్షా! మనచేత పరాభూతులైనవారు సకల లోకంబులందు తామర తంపరలుగా నున్నారు. మునిగణంబులు సురగణంబులు మన బందీలు - ఏ క్షణముననూ ఏమరరాదు. ఎదుట పడివచ్చు శత్రువువల్ల భయము లేదు. మన కంట పడకుండా మా యోపాయమున ప్రవేశించు వారెవరైనా ఉందురేమో గమనించవలె. అయినా నగరరక్షణము గూర్చి భయమింకలేదు. నిర్భీతిగా సంచరింపుడు.

కాలా:- చిత్తము

బాణా:- మంత్రివర్యా మనము బంధించి తెచ్చిన ఆ మునిప్రముచ్చు లేమనుచున్నారు?

కుంభా:- చెఱసాలలో మ్రగ్గుచున్నారు....

బాణా:- అహహ! మ్రగ్గనిండు మ్రగ్గనిండు. కాలాక్షా దిక్పాలురేమి చేయుచున్నారు?

కాలా:- ఎప్పుడూ మీ పేరే తలచుకొనుచున్నారు ప్రభూ!

బాణా:- అహహ! లేనిచో వారినాలుకలుత్తరింపబడునని భయము. హు! దిక్పాలుర మన్న గర్వమున నెంతయో విర్రవీగుచు, సకల సదుపాయంబుల పొందుచు, రత్నమణి మయశోభాయమాన రమ్యోన్నత హర్మ్యాలలో, కుహనా యువతుల కౌగిళ్ళలో మత్తు మందు గుబాళింపులలో పరవశించి పవళించు ఆ సోమరులు విశ్వ కళ్యాణమునే విస్మరించినారు. వారినిక యీ బాణాసురనామ స్మరణమే సింహస్వప్నమై జాగరూకులుగా నుంచవలె.... ఆ... నాట్య కళా విశారదలైన అప్సరాంగన లేమి చేయుచున్నారు.

కాలా:- ఎప్పుడు తమ ముందు నాట్యము చేతుమా అని ఉవ్విళ్ళూరు చున్నారు ప్రభూ!

బాణా:- ఆ... ఆ... ఆ... అహహ! అవునుమరి! ఇంద్రుని నిర్జించి వారినపహరించిన నేనేగదా వారికిక అధినాయకుడను. పాఋబోతగు ఆ ఇంద్రుని సహస్రనేత్రముల చిక్కుట కన్నా పరాక్రమోపేతుడగు యీ బాణుని సహస్రబాహువులలో సేదదీరుటమిన్నయని వారెంచుట యుచితమే గదా! మంత్రివర్యా! ఏదీ ఒక్క అప్సరాంగనను రావించి నాట్యవిన్యాసము చేయించుడు. మనము తిలకించవలె - పులకించవలె.

కుంభా:- చిత్తము. కాలాక్షా! తక్షణమే నాట్యవిన్యాసమునకై అప్సరాంగనను ప్రవేశ పెట్టుము.

కాలా:- ఆజ్ఞ.... (వెళ్ళును)

బాణా:- అమాత్యా! నేను నగరమున లేని సమయంబున రాజ్యమును రాజధానినీ అతి జాగ్రత్తగా కాపాడి సకల కార్యనిర్వహణాభారమును విజయవంతముగా నెరవేర్చిన మీరు బహుధా అభినందనీయులు.

కుంభాం:- అదిమా బాధ్యత ప్రభూ!

అప్సర:- (వచ్చి నమస్కరించును) ప్రభువులకు ప్రణామములు.

బాణా:- ఆ! అప్సరాంగనా! ఏదీ నాట్యవిన్యాసముననీ నైపుణ్యము నొక్కపరి తిలకింపజేయుము.

అప్సర:- నాట్యం

// పాట //

హిర:- (నాట్యవిన్యాసము పూర్తి గావించి నమస్కరించుచున్న అప్సరాంగనను మెచ్చుకుంటూ చప్పట్లతో) భళా! అప్సరా! భళా! నీ నాట్య విన్యాసములో ఇంతమత్తు, గమ్మత్తు గలదు కనకనే దేవతలందరూ తమ విధులను సైతము విస్మరించి నీ నాట్యావలోకనమున తన్మయులగుచున్నారు!.... ఇదిగో ఈ బహుమానమునందుకొని సెలవు తీసుకొనుము... (ఒక హారము విసరగా అందుకొని అప్సర నిష్క్రమణ) .. మహామంత్రీ! ఇంతవరకు శత్రు నిర్భేద్యముగా పరిపాలనము సాగించుచున్న చక్రవర్తులమైన మేము నేడు జగన్నాథులమైనాము. ఈ చతుర్దశ భువనములన్నియు మన పాదార్చనా నిలయములు గావలె. నేటి నుండి విజృంభించుడు... కాలాక్షా! మన కాలకేయ, రక్తాక్ష, ధూమ్రాక్ష, కుంభ, నికుంభ, జాంభర, శాంభర, దంతవక్త్ర, మహావక్త్ర, క్రూరసేన, వీరసేనాది యసురగణాధ్యక్షుల రావింపుడు, అధోలోక, భూలోక, సువర్లోక, మహర్లోకాది లోకములన్నియు ఆక్రమించుడు. మిమ్మెదిరించిన వారిని నుగ్గునుగ్గు గావించుడు.

గీ॥ తరుగుడు తలలను తరుగుడు మౌనులు
హరినామ జపముల నాపకున్న
నరుకుడు చేతులు నరుకుడు భక్తులు
హరిపాద పూజల నాపకున్న
చీల్చుడు నాల్కలు చీల్చుడు శిష్టులు
హరినామ కీర్తన లాపకున్న
మ్రోదుడు పరునగ మ్రోదుడు నురలను
చెప్పిన పనులెల్ల చేయకున్న

గీ॥ నరసురగరుడోరగులు కిన్నరులు మొదలు
సకల జాతులు మన మాట సంస్తుతించి
నన్ను పూజించు మార్గంబు నడవకున్న
ప్రాణములు తీసి వేయుడు పట్టి పట్టి

కుంభాం:- ప్రభూ! ఈ రోజు మీరునూతనోత్సాహులై యున్నారేమి?

చం॥ సహజ విరోధి విష్ణుని వశంబగుచక్రము నుగ్గుజేసితో
సుహరనని మించువాని యొనగూర్చితొ శోణపురంబు కావలిన్
మహిముదితాత్మ గోల్పడిన మానిత భూగగనంబు లేలితో
సహజముగాని రీతి నిట సంతసమొబ్బొన గూడె తెల్పుమా?

బాణా:- కుంభాండా! సకల చరాచర జగత్తును శాసింపజాలువాడు, జనన మరణములులేనివాడు, లయకారుడు, విశేషించి మన యిలవేల్పు, సర్వలోకేశ్వరుడగు పరమేశ్వరుడే స్వయముగా మన నగర ద్వారపాలకుడై రక్షణ గావించుచున్నాడు.

కుంభాం:- ఏమీ! ఆ శంకరుడే ద్వారపాలకుడైనాడా? ప్రభూ! ఇది ఆలోచించియే చేసితిరా?

బాణా:- కుంభాండా! బాణాసురుడెన్నడును అనాలోచితముగా ప్రవర్తింపడు. వెంటనే రణదుందుభులు మ్రోగింపుడు. మన వశముగాకున్న వైకుంఠాది లోకములపై దాడి వెడల వలె. రణములు లేక నా చేతుల రణకండూతి తీరకున్నది.

కుంభాం:- ప్రభూ! సర్వలోకములు మీ వశమైయున్నవి. వైకుంఠమును వదలి నారాయణుడెప్పుడో పారిపోయినాడు. శత్రువేలేని రాజ్యముపై దండయాత్రలేల? అసలు మిమ్మెదిరించువారెవ్వరు?

బాణా:- ఆ... నాకు యుద్ధము కావలె.... శంకర వరప్రభావ సముపేతోజ్వల ప్రకాశరూపమై, ద్విగుణీకృతోత్సాహ ప్రతిభాయుత్పన్నమై, వీరవిక్రమ పరాక్రమార్భటి కొరకెదురు చూచునా సహస్ర బాహువులు సలువులు పెట్టుచున్నవి. రణము మహారణము - నాకు రణము కావలె మహారణము కావలె.

నార:- (ప్రవేశిస్తూ) తథాస్తు! తథాస్తు!!

బాణా:- ఎవరది? (చూసి) ఓహో! నారదమునీంద్రులా! ప్రణామములు ఆసీనులుగండు.

నార:- శుభం భూయాత్

కుంభాం:- బ్రహ్మామానసపుత్రులకు అభివాదములు

నార:- సకల కార్యసిద్ధిరస్తు.

బాణా:- తథాస్తు అని దీవించినారు! రణము సంప్రాప్తించునా మునీంద్రా

నార:- సంప్రాప్తించకున్నచో నీ పూరకుందువా?

బాణా:- లెస్సలెస్స

కుంభాం:- స్వామీ! మా ప్రభువు పేరు చెప్పినంతనే ప్రతివారు శస్త్రములావల పాఱవైచి పాదాక్రాంతులగుచుండగా రణములభించుటెట్లు?

నార:- యుద్ధము మరీ మంచిది గదా! రణంబు లేకయే విజయము కలుగుట కన్న కీర్తి యేముున్నది? బాణాసురా! ఇది నీకు లాభదాయకమును, గర్వకారణమును కదా!

బాణా:- మునీంద్రా! అదియేమి గర్వకారణము?

ఉ॥ వారల వీరలన్ సమర పాటవశీలుర సాహసోద్ధతిన్
మారణ హోమముంజరిపి మామక కీర్తిని విస్తరింపగా
ధారుణి వీరపుంగవులు తామట మెత్తురుగాని యూరకే
శూరుడ నంచనంగ యిల శూరులు మెత్తురె కీర్తికల్గునే?

నార:- నీ బాధ నాకర్థమైనది. అది తీరునుపాయము బోధించెద నట్లొనర్తువా?

బాణా:- అవశ్యము తెల్పుడు - తెల్పుడు.

నార:- నీకు వరంబొసంగిన, ఆ సదాశివునే రణభిక్ష కోరుము.

బాణా:- మునీంద్రా!!

నార:- అవును.

గీ॥ వేయి చేతులవాడవు వివిధ సమర
విజయ శీలివి దైతేయ వీరవరుడ
విట్టి నీతోడ పోరాడ నెవ్వడోపు
శీర్షమునగంగ నోర్చిన శివుడె గాక,

కుంభాం:- నారదమునీంద్రా ఇదేమి చోద్యము? కులదైవము, పైగా స్వయముగా శోణపురరక్షణకేవచ్చిన శంకరునా యుద్ధమునకాహ్వానించుట?

గీ॥ దానవులనెల్ల కాపాడు ధర్మమూర్తి
ఫాలమునవగ్గి కన్నున్న పరమశివుడు
రుద్రమూర్తిగ మారిన రుధిర మొలుక
చావకుందురె శాత్రవుల్ సమరమందు

నార:- కుంభాండా! శంకరుడు మహావీరుడే కాదనను.... మన బాణాసురుడు మాత్రము తక్కువ వాడా?

చం॥ గెలిచెను నాడు నింద్రు నురగేశు జయించె జగంబులన్నిటిన్
బలమున దేవమానవుల బంటులజేసి గడించె కీర్తియున్
అలయక భక్తిగానమున నాలయకారుని లొంగదీసె, వే
పలుకులికేల బాణురణపాటవ మేమరి మాటలాడెదో

బాణా:- అవును. మనమేల భయపడవలె? ఇప్పటికి శంకరుని భక్తిచే గెలిచితిని. ఇక ఖండనమున గెలువవలె. అప్పుడే అప్పుడే మన కీర్తి కిరీటమున కలికితురాయి అమరును. కాలాక్షా!

కాలా:- ప్రభూ!

బాణా:- వెళ్ళుము! నగర ద్వారమున కాపున్న శంకరుని నాకడకంపుము. ఆ.. మరల శంకరుడు వచ్చు వరకు నీవే యచ్చట కావలియుండుము.

కాలా:- చిత్తము ప్రభూ! (నిష్క్రమణ)

నార:- బాణాసురా! భటునిచే కబురంపిన భర్గుడు బాధపడునేమొ నేను వెళ్ళి నచ్చచెప్పి నీవద్దకు పంపెదను.

బాణా:- ఆ... ఆ... నారదా! నీవిచ్చటనే యుండవలయును. నీ సమక్షముననే శంకరుని సమరమున కాహ్వానించెద.

నార:- బాణాసురా! నేనుండుట యంతశ్రేయస్కరము గాదు.

బాణా:- అదెట్లు?

నార:- నేనే నీకీమార్గమునుపదేశించితినని నాపై కోపింపక పోవడా నందివాహనుడు... కనుక....

బాణా:- అర్థమైనదిలే... నీవు కలహనాటక సూత్రధారివని యాతడెరుంగును గదా!.... సరిసరి... వెళ్ళుము... కానీ నారదా! మా రణమహోత్సవమును మాత్రము... ఆకసమునుండయినా తిలకింపుము.

నార:- ఆ... ఆ... నీ సంగతి పూర్తి యగువరకు....

బాణా:- మునీంద్రా?

నార:- అహహ! నీ సంగరము పూర్తియగు వరకు నేనీ పరిసరములలోనే యుండి ఆసాంతము పరికించెదనులెమ్ము....

బాణా:- ఆ... ఇకబోయిరమ్ము

నార:- (పోబోవుచు చివరన) నారాయణ! నారాయణ!! (వెళ్ళును)

బాణా:- నారదా! నారాయణ నారాయణ గాదు బాణాసుర బాణాసుర అనవలె (నారదుని అనుసరిస్తూ తెరలోకేగును- తెరలో) ఏదీ అనుము.

నార:- బాణాసుర! బాణాసుర!!

బాణా:- మరొక్కమారు

నార:- బాణాసుర! బాణాసుర!! బాణాసుర!!!

బాణా:- (నవ్వు)....

కుంభాం:- అయ్యో! నారదుని మాటలు విశ్వసించి మాయలో పడినాడు బాణాసురుడు....

గీ॥ తామొనర్చిన తప్పులే తమను చెఱచు
తామొనర్చిన యొప్పులే తమను గాచు
మంచిచెడులను గూర్చిన నంచితంబు
దైవమునకేల కర్తయె దాల్చుగాని

బాణా:- (ప్రవేశిస్తూ) కుంభాండా! యేమి యోజించుచున్నాడవు?

కుంభాం:- ఏమియూ లేదు ప్రభూ!

బాణా:- అహహ! నీ సంశయము నాకర్థమైనదిలే... నీవేమియు భీతి చెందకుము....

శంక:- (ప్రవేశించి) భక్తా బాణాసురా!

బాణా:- దేవదేవా నమస్కారము.

కుంభాం:- భక్త రక్షకా నమోనమః

శంక:- (ఇద్దరినీ ఆశీర్వదిస్తూ) ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు!

బాణా:- అందుకొరకే స్వామీ! మిమ్మిటు పిలువనంపినది.

శంక:- ఏమి నీకు గల కోరిక?

బాణా:- నీలకంధరా!

ఉ॥ ఆహవరంగమందున సహస్రభుజంబులధాటి కోర్చియున్
సాహసమేర్పడన్ సమరసారము చూపెడి వారులేక నా
బాహువులెంతయో బలిసె భండన భూమిని నన్నెదిర్చి య
వ్యాహత లీల పోరగల వాడవు నీ వొకరుండవే హరా!

శంక:- (స్వగతం) ఏమిది? వీని వచనములాశ్చర్యముగా నున్నవి... వీడు నన్ను యుద్ధము చేయుమని కోరడు గదా? (ప్రకాశంగా) బాణాసురా

గీ॥ సంగరము నందు నీ ముందు సమముగాను
అస్త్రశస్త్రములందున నారి తేరి
నిలువజాలువా డెటలేడు నిజమెగాని
తావకమనంబు ననుగూర్చి తడువనేల

బాణా:- అదియే స్వామీనే చెప్పబోవునది...

ఉ॥ శాత్రవ వీర సంఘ బలశౌర్య పరాక్రమ హేతుభూత దృ
జ్మాత్ర నిశిధనీ పటల మావలద్రోచి జయంబుగొన్న నా
గాత్రము నింక నీదు యురగాభరణాంచిత గాత్రస్పర్శకున్
పాత్రముజేసి నాతో రణపాటవ మొప్పగ చేయిగల్పవే

శంక:- బాణాసురా! ఈ మధ్యకాలంబున నీమనను వికృతమార్గంబుననే పయనించుచున్నది.

గీ॥ భక్తి భావంబునకు మెచ్చి భవ్యమతిని
ద్వారపాలకుడను మాటదలపకుండ
నీదు నగరముగాపాడ నిలచినాడ
అట్టినను నేడు పోరాడమనగ దగునె

బాణా:- (నవ్వి) ఏమి చేతును దేవదేవా? నాతో సరితూగి రణంబొనర్పగలవాడవు నీవొక్కడవే, పోనీ నీకును భీతిగా నున్నచో నీ ప్రమథగణమును, సురసైన్యమును, అష్టదిక్పాలురను, బ్రహ్మాదిదేవగణములను సహాయముగా తెచ్చుకొనుము - అప్పుడు నాకు సరితూగగలవు. కయ్యము వియ్యము సములతో నలువవలెగదా!

శంక:- ఓరీ తామస గుణాధమా!

బాణా:- శంకరా!

శంక:- నికృష్టుడవైన నీతో యుద్ధమొనరింప యిందరి సహాయము కావలెనా? నా భక్తుని నేనే వధించుటకు మనసొప్పకగానీ లేనిచో క్షణకాలమున నిన్ను, నీ శోణపురమును ఫాలనేత్రాగ్నిచ్ఛటల భస్మీపటలము గావింపగలను. ధూర్తుడా నీవు యుద్ధమునే కోరితివి గాన.

గీ॥ నీదు కేతన మెప్పుడు నేలబడునొ
అపుడె చేతులబరువును నణగునట్లు
నాకు సముడగు వానితోనయముగాను
సంగరంబొనగూడునో చపలచిత్త
(శంకరుడు వేగముగా నిష్క్రమించును)

బాణా:- అహహహ! కోపించినను శంకరుడు మంచివరమే ప్రసాదించినాడు. శంకరునితోనైననేమి! అతని యంతటి వానితోనైన నేమి? నాకు కావలసినది యుద్ధము. అ.. యుద్ధమే... అమాత్యా జాగ్రత్తగా గమనించుడు ఏమరక కాపుంచుడు.. మన కేతన మెప్పుడు కూలునో అప్పుడే రణము - మహారణము - అహహ - రణము - మహారణము.

కాలా:- ప్రభూ! ప్రభూ! కొంపమునిగింది.

బాణా:- ఆ! అప్పుడే కేతనము పతనమైనదా?

కాలా:- అదిగాదు ప్రభూ!

బాణా:- ఊ... మరేది?

కాలా:- ఇప్పుడే తెలిసింది. ఎట్లానో కనిపెట్టాను ఇట్లాగవుతుందనుకోలేదు. కన్నుచెదరకుండా కాపలా కాస్తూనే వున్నాను.

కుంభాం:- నీవాచాలతనాపి అసలు సంగతేమో తెలుపరా!

కాలా:- తెలుపుతాను తెలుపుతాను... కానీ....

బాణా:- కాలాక్షా! భీతిచెందక జరిగిన విషయము వివరింపుము.

కాలా:- ప్రభూ! తమరే రక్షించాలి.

చం॥ *అలయక మీదు పుత్రికను నంతిపురంబును దాటకుండగన్*
*తలపగ లోని కేరికి సతంబు ప్రవేశము కల్గకుండగన్*
*తెలివిగ కాచుకొంటిమి తుదిన్ గన చిత్రము జర్గెనో ప్రభూ*
*తెలియగ నేరమయ్య సుదతీమణి గర్భము దాల్చెనెట్టులో*

బాణా:- కాలాక్షా... (కోపమున మీదికురుకును కుంభాండు డడ్డువచ్చి)

కుంభాం:- ప్రభూ క్షణమోపిక పట్టుడు... అసలు విషయమేమో విచారింతము

బాణా:- ఊ...

కుంభాం:- కాలాక్షా! వెనుక ముందులాలోచింపకుండా మాట్లాడుచున్నావు. నీ కీ విషయమెట్లు తెలిసెను.

కాలా:- మంత్రిగారూ! తమ కూతురు చిత్రరేఖమ్మగారు అంతఃపురం నుండి ఆరాటంగా వెళ్తూ కంగారున అసలు విషయం బయట పెట్టింది. ఆ మాట విని ఇటు పరుగెత్తుకొచ్చాను. నన్ను రక్షించాలి.

బాణా:- ఓరీ అనందర్భ ప్రలాపీ నీవు చెప్పినదసత్యమైనచో జరుగునదేమో తెలియునా?

కుంభాం:- ప్రభూ! ప్రశాంతంగా ఉండండి. ఈ మధ్య అంతఃపురములో నరసంచారమున్నట్లు అనుమానమువచ్చినది అదే ఇప్పుడు నిజమైనది.

బాణా:- అట్లైన యేలనుపేక్షించితిరి?

కుంభాం:- అది యువరాణి గారి అంతఃపురము. అచ్చట వెతుకుటకు ననుమతిలేదు. పైగా మీరు నగరమునలేరు. ఏమి చేయవలయునో తోచక బయటి నుండియే అంతఃపురమును అతి జాగ్రత్తగా కాచుకొని యున్నాము. కానీ జరుగరానిది జరిగిపోయినది. మేము క్షంతవ్యులము ప్రభూ!

బాణా:- క్షమాపణలతో కార్యము సానుకూలము కాదు. మంత్రివర్యా దోషులను శిక్షింపవలె.

కుంభాం:- ప్రభూ! యువరాణిగారు తనకు తగిన వానిని తప్ప ఇతరులనపేక్షించునా?....

గీ॥ ఉచిత మార్గము తెలిసిన యుషను మీరు
తప్పు పట్టెదు ముందుగ తవన వీడి
ఆమె యభిమత మేమిటో యడుగదగును
బాల బేలనరాదామె బాణుపుత్రి

బాణా:- అమాత్యా! ఇక విచారింపవనిలేదు. చతుర్దశ భువన విజేతనై సృష్టి స్థితిలయంబులకధినేతగా భాసిల్లవలెనన్న నా బృహత్ర్పణాళికకే విఘాతము జరిగినది. నాయున్నతికవరోధ మగుచున్న యీ సంఘటననుపేక్షింపరాదు. మనుజాంగనలు రాక్షసపరిగ్రహీతలగుట జరుగవచ్చును. గాని - రాక్షసాంగనను ఒక మనుజుడు చేపట్టుట.... అవమానము - దుర్భరావమానము. నా సహస్రబాహుదర్పమెరుగక నరసురగరుడోరగులుసైతము కన్నెత్తి చూడసాహసింపని నా అంతః పురమును ప్రవేశించిన అనరాధముని తక్షణమే శిక్షింపవలయును. కాలాక్షా - వెళ్ళుము. అంతఃపురమును శోధించి, అనరాధముని పట్టి బంధించి నా పాదములచెంత పడవేయుము. వెళ్ళుము.

కాలా:- చిత్తము ప్రభూ (వెళ్ళును)

బాణా:- మంత్రివర్యా! అనరాధముని విచారించి శిక్షింప సన్నాహములు గావింపుడు (నిష్క్రమణ)

కుంభాం:- అంతా విచిత్రముగానున్నది. అన్నీ దుర్నిమిత్తములే దోచుచున్నవి. ఈ దానవ వంశమంతరించు సమయమహో.... బాణు వినాశమహో సమీపించుచున్నట్లున్నది.

గీ॥ జగములన్నింటి యందున జయముగాంచి
భర్గుమెప్పించి మించిన భవ్యయశుడు
కార్యమెంచక శంకరు కదన మడిగె
శకునములు ప్రతికూలమై చనగనుండె

హా! అంతా దైవలీల.....

# తృతీయాంకము - రెండవ రంగము

(ఉద్యానవనంలో ఉషానిరుద్ధుల పాట)

అని:- ఇరులసిరులు దొరలు కురుల రాణీ
కులుకులొలుకు పలుకుల అలివేణీ ॥ ఇరుల ॥

ఉష:- మారుతూపురూపుమాపు రాజా
తలపున వలపులు చిలికిన భోజా ॥ మారు ॥

చరణం:అని:- మనసుదోచి ప్రియుని గెలిచినావు
మరులు గొలిపి ఇంటనిలిపినావు

ఉష:- మదనకేళి నన్ను తనిపినావు
నా కడుపు పండు భాగ్యమిచ్చినావు ॥ ఇరుల ॥ మారు ॥

చరణం2:అని: అమర సుఖములందించిన బాలా
నాతోడరాగదే జాలమేలా

ఉష:- పూర్ణఫలము పొందనిందు స్వామీ
మీ ప్రాణమగుదు నిదే నా స్వామీ॥ ఇరుల ॥ మారు ॥

///

అని:- దేవీ నీ సౌందర్యము దినదినప్రవర్థమానమగుచున్నది సుమా

ఉష:- అంతటి సౌందర్యవతినా నేను

అని:- అవును... చూడు

గీ॥ తళుకులీను నీ చెక్కుటద్దంబు లతివ
రాగమొలికించునధరాలు రమణి నీవి
హంసనడలించు నడకలు నమరెనీకు
మరులు గొల్పెడు నీమేనిమవ్వ మబల

ఉష:- చాలులెండు... మీరెంత సుందరులో తెలియక నన్ను వర్ణించుచున్నారు.

గీ॥ కలువల మదమడంగు మీకనుల గాంచ
పసిడి కందును మీ మేని పసిమిచూడ
సింహ మడలును మీకటి శ్రీని గనిన
మరులు గొందురు మిముగాంచి మగువలెల్ల

అని:- అందుచేతనే కాబోలు నీవు నాపట్ల మరులుగొన్నది?

ఉష:- ఇంకా చెప్పనేల... కానీ ఇంతటి సౌందర్యమును శృంగార రసతరంగిణిగా పేరుగాంచిన ద్వారకలోని యువతీమణులెంత జుఱ్ఱుకొనినారోయని...

అని:- నీ ఆలోచన - చెప్పమందువా?

ఉష:- చెప్పుడు

అని:- చెప్పిన పిదప మొగము మాడ్చుకొనవు గదా?

ఉష:- అంతటియవసరమేమీ లేదు. చెప్పుడు.

అని:- గీ॥ *కనుగొనల నను జూచుచు కలవరమున*
*వడతు లధరచాలనమున పలుకరించి*
*అతివ లానందబాష్పము లర్ఘ్యమిచ్చి*
*భావములె హారములు జేసి ప్రస్తుతింత్రు*

ఉష:- ఛీ... పొండు

అని:- అదిగో.... చెప్పమనినావు చెప్పిన పిదప పొమ్మనుచున్నావు ఎచ్చటికి పొమ్మందువు... ఆ ద్వారకకేనా?

ఉష:- ఆ.. ఆ... పోయెదరు పోయెదరు. ఇకముందు మిమ్ము దెచ్చుటకు పూర్వము వలె మా చెలియవసరము లేదు. ఇదిగో పుట్టబోవు మీ పుత్రరత్నమే మిమ్ము చెవిపట్టి తీసుకురాగలడు.

అని:- అవునులే ఇకముందు నా కన్నా వాడేనీకెక్కువ కాగలడు.

ఉష:- లేదు లేదు... నా ప్రాణమయిన మీ తర్వాతనే నాకెవరైనా!

అని:- దేవీ! నాకా విషయము తెలియకనా? పరిహాసమునకట్లంటిని.... ఇప్పటికైనను మన విషయము నీ తండ్రిగారి కెరిగించుట యుక్తము.

ఉష:- అమ్మో! మా తండ్రికే... ఇంకేమైనా యున్నదా? మీకేదైనా కీడొనరించిన....

అని:- చెలీ నాకేదో కీడుజరుగునని, ఎవరో కీడొర్పగలరని భావించి భయపడకుము. నన్నెవ్వరిగా భావించితివి?

గీ॥ *శౌరిమనుమడ ప్రాద్యుమ్ను శూరవరుడ*
*బాణుడన్నంత వెఱతునె? భండనమున*
*గీటడంచియు రణభూమి గెంటగలను*
*బాల యీ లీల నీవేల బేలవగుదు?*

ఉష:- ఏమో! ఇప్పటికే నా గర్భధారణమును గూర్చి అంతఃపుర పరిచారికలు చెవులు కొరుకుకొనుచున్నారు. మా తండ్రికి సంగతి తెలిసినచో... యేమి జరుగునో - ఊహింపలేను.

అని:- ఉషా! ఈ రోజు కాకున్న రేపొకనాటికీ విషయము బహిర్గతము గాక మానదు. కనుక ధైర్యమువహించి నీవే స్వయముగా నీతండ్రి కెరిగింపుము. అంతయూ సవ్యముగా జరుగును. (తెరలో నుండే అరుస్తూ కాలాక్షుడు ప్రవేశం)

కాలా:- ఎక్కడ అనరుడెక్కడ? వాడినిప్పుడే పట్టి పల్లారుస్తాను (ప్రవేశం) ఎక్కడ (అనిరుద్ధుజూసి) ఎవడవురానీవు? కఱకుకత్తిపట్టినోన్ని కాలయముని మించినోన్ని ఈ కాలాక్షుని కన్నుగప్పి లోనికి రావడానికి నీకెన్ని గుండెల్రా? నిన్నిప్పుడే ఈ కఱకుకత్తితో చీల్చి ముక్కలుముక్కలుచేస్తాను.

ఉష:- వలదు! వారినేమియు అనవలదు.

అని:- చెలీ! ఏలభయువడెదవు మొఱిగెడు కుక్కలెప్పుడును కఱువవని వినియుండలేదా? ఈ గ్రామ సింహమునకేల భయపడవలె?

కాలా:- ఆ! ఏమంటివిరా మానవా? నేను గ్రామ సింహాన్నా! నా పరాక్రమము నీకేమి తెలియునురా? మా బాణాసుర ప్రభువుగారు యుద్ధానికి వెళ్ళినప్పుడు ఆయన కూల్చే ఏనుగుల్నీ, పీనుగుల్నీ రాత్రిపూట కూర్చొని సుష్టుగా భోంచేసి (త్రేపు) అక్కడే గుఱ్ఱుపెట్టి నిద్రపోయే వాన్ని, ఆ నా గుఱ్ఱువిని శవాలు సైతం ఎగిరిగంతేసి పాఱిపోయేవి తెలుసా?

అని:- ఆ! ఆ! కనిపించుచునే యున్నది నీ పరాక్రమము... కానీ ఎందులకు వచ్చినాడవు?

కాలా:- ఏమిటీ? ఎందుకొచ్చావని నేను నిన్నడగాల్సిన మాట నువ్వేనన్నడుగుతున్నావా? అసలింతకూ నీకు బతకాలనుందా? ఉంటే మర్యాదగా తప్పొప్పుకొని, చెంపలేసుకొని నా వెంటరా.

అని:- నా సంగతేమియోగాని నీ కుండెనా?

కాలా:- ఏమిటి!

అని:- బ్రతుకవలయునను ఆశ.

కాలా:- ఆ! ఇకలాభం లేదు. నిన్ను బతుకనియ్యను. పొడిచేస్తాను. నరికేస్తాను. చీల్చేస్తాను. చంపేస్తాను.

ఉష:- కాలాక్షా! ఎవరితో మాట్లాడుచుంటివో ఎరుగుదువా? మా నాన్నగారితో చెప్పిన....

కాలా:- అహహ! (నవ్వు) చెప్పండి! మీ తండ్రిగారే వీన్ని పట్టికొట్టి కాళ్ళు చేతులు కట్టి తన కాళ్ళముందు పడేయమని నన్ను పంపించాడు. అగ్గిమీద గుగ్గిలంలా మండిపడుతున్నాడు.

ఉష:- నాయనగారికీ విషయము తెలిసెనన్నమాట.

అని:- ఉషా! భయపడకుము. ఓరీ రాక్షసాధమా నీవేగి నీప్రభువునే రమ్మనుము పొమ్ము.

కాలా:- నీ బోటి వానితో యుద్ధము చేయుటకు మా ప్రభువు రావలయునా?

గీ॥ *కాళికమ్మను పూజించికత్తి బట్టి*
*కదనమందున నిలిచిన కాల యముని*
*మించిపోయెడు కాలాక్షు నొంచగలవె?*
*మానవుడ! నీదు బ్రతుకింక మాసిపోయె.*

కాచుకో.... (కత్తితో కొట్టబోగా రెండు మూడు మార్లు తప్పించుకున్న అనిరుద్ధుడు వానిచేయి మెలిత్రిప్పి కత్తి క్రిందపడవైచును)

అని:- (వానిని పడద్రోచి పైన కాలుంచి) ఒరేయ్! నీ ప్రభువుతో నామాటగా నిట్లు చెప్పుము.

ఉ॥ *సంగర రంగమందు శరసంజనితోజ్వల తీవ్రతన్, సము*
*త్తుంగ తరంగ మొద్ధొరసి త్రుళ్ళి నివర్తనమైన భంగి క్షు*
*ద్రాంగ తురంగ యుక్త చతురంగ బలమ్ములు కృంగనేడ్చు నీ*
*ముంగట పెండ్లియాడెదను మోహన మూర్తి నుషాప్రియాంగనన్*
*(లేపి వానిని ఒక్క తాపుతో బయటపడవేస్తాడు)*

ఉష:- స్వామీ! మానాయనగారెట్టి ఆపద తలపెట్టునో? మా చెలిని పిలిపించి యోగవిద్యచే మిమ్ము ద్వారకకు పంపించెదను.

అని:- ఉషా! మీ తండ్రి పరాక్రమమును గూడా పరికించెద రానిమ్ము.

ఉష:- అటులగాదు స్వామీ! నా మాటలాలింపుడు సర్వలోకముల జయించిన మా తండ్రితో సమరము మంచిది గాదు.

అని:- ఉషా! ఇంత వరకు వచ్చిన పిదప వెనుదిరుగుట వీరలక్షణము కాదు. విజయమో వీరస్వర్గమో...

ఉష:- (అనిరుద్ధుని నోటికి తన హస్తమడ్డుంచి) అమంగళము ప్రతిహతమగుగాక.

బాణా:- (తెరలోనుండే) ఎవడురా? ఎవడురా? ఎవడురా నా భటుని మర్దించినది? (వచ్చి) ఎక్కడ? ఆనరాధముడెక్కడ?

అని:- ఇచ్చటనే మామా! నీయల్లుడిచ్చటనేయున్నాడు.

బాణా:- ఛీ! భ్రష్టా! మరొక్కమారా మాటయన్నచో నీనాలుక వేయి చీలికలు చేసెదను. నీవటరా నా అల్లుడవు? నేనింటలేని సమయమున - రహస్యముగనంతః పురమున ప్రవేశించి, నా కుమార్తె నేమార్చి, ఆడుదానివలె దాగిన నీకా అర్హత యెట్లబ్బునురా? ఇంతకూ నేనెవ్వడనో ఎరుగుదువా?

ఉ॥ *బాణుడనేను దేవతల పాలిటి కాలయముండనై సదా*
*ప్రాణములూడ్చితిన్ సమర రంగమునందున ధీరతన్, జగ*
*త్త్రాణుడ నేనె, శంకరుని రాజసమొప్పగ బంటు చేసితిన్*
*ప్రాణము నిల్చునే సమర పాటవశీలిని నన్ను దాకినన్*

అని:- మరినేనెవ్వడనో ఎరుగుదువా?

గీ॥ *కృష్ణదేవుని మనుమడ వృష్ణికులుడ*
*పరగ ప్రద్యుమ్న తనయుడ బలయుతుండ*
*వీరు డనిరుద్ధుడనగ నే బేరుబడితి*
*సమరరంగాన ననుదాక సాధ్యమగునె?*

బాణా:- ఏమేమీ? ఆమాయలమారి కృష్ణుని మనుమడవా! అందులకే కాబోలు దొంగతనముగా కన్యలనెత్తుకొని బోవుట యాతనికిని దొంగతనముగా కన్యాంతఃపురమున మనలుటనీకును అలవడినది.

అని:- ఆనాడా రుక్మిణీదేవి ప్రార్థన చేతనే కృష్ణ ప్రభువామెనాదరించినాడు. ఈనాడీ ఉషాదేవి అభ్యర్థనముననే యీ అనిరుద్ధుడిందున్నాడు.

బాణా:- ఓరీ వాచాలా! ఇంకనూ నా ముందు మాయమాటలాడ సాహసింతుపటరా? నిన్నిదే మదీయబాహుప్రహారంబున ముద్దగావించి ద్వారకలోపడునట్లు విసరివైతును.... ఊ... లేదు లేదు... నిన్ను నిర్జీవముగానైననూ మీవారి చెంతకు చేరనివ్వరాదు... కాళికాదేవికి బలియిత్తును, నరమేధముగావింతును.

ఉష:- (అనిరుద్ధుని మీదకు రాబోవుచున్న తండ్రికి అడ్డువచ్చి) జనకా క్షమింపుడు. వారితప్పేమియు లేదు. నేనే స్వప్నమున గాంచి యోగవిద్యా ప్రభావమున ద్వారక నుండి తెప్పించితిని.

బాణా:- ఛీ! కులపాంసనీ! ... కన్నమమకారము గారాబము చేయ నీవింతకు తెగింతువని ఎఱుగనైతిని.. పొమ్మావలకు.. (త్రోయును)

అని:- బాణాసురా! అర్థరహితముగా అబలపై చేయిచేసుకున్న నిన్నిక ఉపేక్షింపను.

ఉష:- మీరైననూ శాంతింపుడు. మా తండ్రిగారి నెట్లో బ్రతిమాలుకొందును.

అని:- ఉషా! ఇంకానీకీ మమకారమేల? తొలగుము. నేటితో యీ బాణాసురుని బండారము పటాపంచలుగావలె (ఖడ్గమందుకొనును)

బాణా:- ధూర్తుడా రమ్ము... (ఇరువురూ యుద్ధం చేస్తూ తెరలోని కెళ్తారు. ఉష ఆత్రంగా చూస్తూంటుంది. అనిరుద్ధుడు విసురున బయట పడి పోవును బాణుడతనిపై పాదము మోపి) అహహ! అహహ! కాలాక్షా!

కాలా:- ప్రభూ! (వచ్చును)

బాణా:- ఈ ధూర్తుని బంధింపుము కాళికాదేవికి బలియిత్తము.

కాలా:- చిత్తము (అనిరుద్ధుని బంధించి తీసుకెళ్ళును.)

ఉష:- తండ్రీ! వారినేమియు చేయకుడు... మీ కూతురుముఖము చూచియైనను విడిచిపుచ్చుడు. పుట్టబోవు మీ మనుమని తండ్రి లేనివానిచేయకుడు. (బాణుని పాదములపై బడును)

బాణా:- ఛీ కులకళంకినీ! (పాదముతో త్రోచివైచి) పవిత్రశీల సౌభాగ్యంబున పరిఢవిల్లు బాణాసురు వంశమునే కళంకీ భూతము గావించిన నీ మాట విందునా? సంకరజాతుడైన ఆ పుట్టబోవు బాలుని మాత్రము రేపు బ్రతుకనిత్తునా? నిన్నును ఖండఖండములు గావింపవలె! (మీదకు పోయి ఆగి) కానీ! కూతురువన్న మమకారముచే నిను వధింప చేతులు రాకున్నవి. నీవీ యంతఃపురముననే బందీవిగా నుండుము... ఓరి సైనికులారా! ఈమె యువరాణియని భావింపక నేటి నుండి గృహ నిర్భంధమున నుంచుడు... ఎవరును యీమెను దర్శింపరాదు. ఆ... ఛీ! పాతకీ! (అసహ్యించుకొని వేగముగా వెళ్ళును)

ఉష:- అయ్యో! దైవమా! చివరికి నాజీవితమెట్లుమారినది. హా ప్రాణప్రియా అనిరుద్ధా! (మూర్ఛిల్లును)

/// తెర ///

# చతుర్థాంకము - మొదటిరంగము

*(కృష్ణమందిరము - కృష్ణుడు వేణుగానమున నుండగా బలరామ ప్రవేశం)*

బల:- (వస్తూ) కృష్ణా! కృష్ణా!! తమ్ముడా గోపాల కృష్ణా!!!

కృష్ణ:- అగ్రజులకు అభివాదములు - ఆసీనులు గండు.

బల:- (కూర్చొని) అనిరుద్ధు వెదుకబోయిన మన సాత్యకి మొదలుగాగల యాదవ ప్రముఖులింకను రాలేదేమి?

కృష్ణ:- నేనును అనిరుద్ధుని గూర్చియే ఆలోచించుచున్నాను. మనవారెట్లైనను వానిజాడ తెలుసుకొని యెవత్తురు. మీరు విచారింపకుడు.

బల:- కృష్ణా! నాకెందుననో మనసు ఆరాటపడుచున్నది. నీవు విషయమెరిగియు దాచి యుంచినావేమో యని సుంతయనుమానము కలుగుచున్నది.

కృష్ణ:- (లేచి) అగ్రజా! అట్లేల తలంచెదరు. అనిరుద్ధుని పరాక్రమ సంపత్తి యెరిగియున్నవాడనగుటచే భయములేదనుచుంటిని.. (దూరంగా వింగ్‌లోకి చూస్తూ).... అదిగో మన సాత్యకివచ్చుచునే యున్నాడు.

సాత్య:- అగ్రజులకు అభివాదములు (ప్రవేశిస్తూనే)

బల:- సాత్యకీ! రమ్ము! నీరాక కొరకే ఎదురుచూచుచున్నాము. అనిరుద్ధు జాడ తెలిసెనా?

కృ:- అగ్రజా! (వారించి కూర్చొనిమనిసైగజేసి - సాత్యకిని కూర్చొన బెట్టి తర్వాత) తమ్ముడా! ఇప్పుడు చెప్పు. ఎందెందు వెదకినారు? అనిరుద్ధుడెందున్నాడు.

సాత్య:- సోదరులారా! సైన్యయుతముగా వెళ్ళి అనేక ప్రదేశముల పరిశీలించితిమి.

గీ॥ *తిరిగినారము గాలియుచొరని యట్టి*
*చోటులందున యెంతయు సొలసినాము*
*సూర్యచంద్రుల కాంతులు జొరని చోట*
*చూడబోవగ మనవాని జాడలేదు*

బల:- ఏమీ! అనిరుద్ధుని జాడయే తెలియలేదా? ఏమి యీ వైపరీత్యము శతసహస్రానేక వీరవరుల నెక్కటికయ్యంబున నొక్కుమ్మడి నుక్కడంపజాలు వీరవరేణ్యుడైన యనిరుద్ధుడు మాయమగుటయే చిత్రము ఎంతవెదకినను కనరాక పోవుట చిత్రాతిచిత్రము.

కృ:- అగ్రజా! ఎచ్చటనున్నను మన అనిరుద్ధునకెట్టి భయము లేదని నామనము చెప్పుచున్నది. కానీ ఇందరముండియు ఒక్క బాలుని జాడ తెలియలేక పోవుట బాధగా నున్నది.

సాత్య:- సోదరా!

గీ॥ చింతతోడ విచారము చేయుదురని
మరలనొకమారు మిముజూచి మరలదలచి
వచ్చినారము మేమిటు వారి జాడ
అజ్ఞయిండు వెదుకబోదు మతిరయమున.

బల:- సాత్యకీ! మానవసామ్రాజ్యములందేగాదు, దానవరాజ్యములందు గూడా గాలింపుడు. భూవలయమునందొక్కయంగుళమేనియు వదలరాదు.

(తెరలో... ప్రభూ! నారదమహర్షి వేంచేసి యున్నారు.)

బల:- నారదమహర్షియా! సాత్యకీ నీవెదురేగి నారద మునీంద్రుని సాదరముగా తోడ్కొనిరమ్ము.

సాత్య:- అటులనే (వెళ్ళును)

బల:- కృష్ణా! నారదమునీంద్రులు మంచి సమయమునకే వచ్చినారు. త్రిలోక సంచారియగునీతనికేమైనా మన అనిరుద్ధుని జాడ తెలియునేమో?

కృ:- రానిండు విచారింతము.

నార:- (సాత్యకితో వచ్చి) నారాయణ! నారాయణ!!

బల:- సురమౌనులకు ప్రణామములు.

కృ:- బ్రహ్మమానస పుత్రులకు అభివందనములు.

చం॥ పరమ మునీంద్ర చంద్ర తమపాదసరోజరజంబు సోకినన్
నరసుర యక్షకిన్నరులు నాగులికెందరొ దాన వోత్తముల్
తరతమ భేదమేల మరి తామొనరించిన పుణ్యమెట్టిదో
దురితములన్నిపోయి పరితోష సుఖంబులు శ్రీలుపొందరే
(కూర్చోబెడతాడు - నారదుడు కూర్చొని)

నార:- మీ అందరి ఆదరణయే సురమౌనికి పదివేలు. గోపాలకృష్ణా.

గీ॥ కుశలమే యదునందన కువలయమున
భ్రాతృసుతపౌత్రతతియును భామినులును
చెలులు చుట్టముల్ భృత్యులు సేమమొప్ప
మిమ్ము సేవించు చుండిరే మేలుగాను

కృ:- ఆహా మీ దయవలన కుశలమే.....

గీ॥ బ్రహ్మమానస పుత్రులు భక్తవరులు
మీ అనుగ్రహముకతన మేలు గాక
అన్య మెట్లానగూడు నీయవని యందు
మీకు తెలియనిదేది యీ లోకమందు.

బల:- నారదమునీంద్రా! మా కుశలమునకేమిగాని.... ఇప్పుడు మాకు గడ్డు సమస్య యెదురైనది. ఒకరోజు రాత్రికిరాత్రే మా అనిరుద్ధుడు కనిపించకుండా మాయమైనాడు. అసమాన శౌర్యపరాక్రమోపేతుడగు అతడేమయ్యెనాయని మా ఆరాటము.

మ॥ సురమౌనీ యనిరుద్ధు డెందరిగెనో సుంతైననేనేరకన్
తెరవున్ గానగ పంచితెందరినో యేదిక్కున్ విడన్ జాలకన్
మరినాకేటికో జాడలేదకట యేమాయావి పన్నాగమో
అరయన్ మార్గము దెల్పి తామికను మాకానందమున్ గూర్చుడీ

పార్వ:- సురమునీంద్రా!

గీ॥ వెదుకదగు నన్నితావుల వెదకినాము
కానరాడేమి చోద్యము కనులుగాచె
మదన తనయుని కనుగొను మార్గమెదియొ
యెఱుగ బలుకుము దేవమునీంద్రచంద్ర

కృ:- నారదమునీంద్రా!

చం॥ మనమున చింతలేదు మరిమాయనిరుద్ధు గురించి సంయమీ !
ఘనులగు యెందరో భటుల కన్నులుగప్పి కుమారుచేకొనన్
ఘనతర శోభతో చెలగు కాంచన పీఠమునొప్పియున్న మ
మ్మనఘ శిరంబుదన్ని మణినన్యుడు చేకొనెనంచు గుండెదన్

నార॥ అయినచో అనిరుద్ధుని గురించిన సమాచారము మీకింకను తెలియదనినమాట. అసలావిషయపూర్వాపరములనెరిగింత మనియేనే వచ్చినది.

గీ॥ శోణపుర యువరాణి సుశోభితాంగి
ఆయుషాకాంత యుల్లంబునలర స్వప్న
మందు ననిరుద్ధు చేపట్ట నతివ గోరి
యోగ విద్యచె రావించె యొప్పిదముగ

బల:- ఏమేమీ! ఇంతకు మా అనిరుద్ధు మాయముగావించినది ఒక అబలయా? ఔరా! విధివైపరీత్యము!!

కృ:- అట్లయిన మా అనిరుద్ధు డుషాకుమారి యంతఃపురమున క్షేమముగా నున్నాడు గదా?

నార:- ఆఆ... కొంతకాలముషానిరుద్ధులు యెవ్వరికంట పడక అంతః పురముననే సంచరించిరి. ఇంతలోనామె గర్భముదాల్చినది. కైలాస నాధుని తన ద్వారపాలకునిగా గొనివచ్చిన బాణాసురనకీ విషయము తెలిసినది.

కృ:- బాణుడు కైలాసనాథునే తన ద్వారపాలకునిగా తెచ్చినాడా?

నార:- ఆ! అదియొక గాథ! భర్గుని తాండవకేళికి సంగీత సాహిత్యముల జోడించి, ఆతని మెప్పించి ఈ వింతవరము పొందినాడు బాణుడు.

బల:- సరిసరి - "వినాశకాలే విపరీత బుద్ధి" ... ఆ తరువాత

నార:- తన కూతురు ఒకనరుని ద్వారా గర్భవతియైనదని యెరిగిన బాణుడుగ్రుడై భటులనంపి వాని బంధింపుడనియె

సాత్య:- మా అనిరుద్ధున కదియొక లెక్కయా? వారిని నుగ్గునుగ్గు గావించియుండును.

నార:- సాత్యకీ! బాగుగా చెప్పితివి అట్లు జరుగుటచే భంగపడిన బాణుడు తానే స్వయముగా అనిరుద్ధునెదుర్కొని ఘోర సంగ్రామమొనరించి తుదకు అనిరుద్ధుని బంధించినాడు.

బల:- ఏమేమీ? మా అనిరుద్ధుడు బంధింపబడినాడా? అంతటి పరాక్రమోపేతుడా ఆ బాణుడు? ఇక ఉపేక్షింపరాదు. సాత్యకీ! రణదుందుభులు మ్రోగించుడు శోణపురమును శోణితపురము గావించి అనిరుద్ధుతెత్తును.

కృ:- అగ్రజా! ముందుగా మనమొక రాయబారిని పంపిన బాగుండునేమో!

బల:- కృష్ణా!

గీ॥ *మనల నెల్లర యుక్తిచే మాయజేసి*
*అకట యనిరుద్ధు గొనిపోయి నట్టి నీచు*
*బంధుయుతముగ మ్రందింప వలెను గాని*
*రాయబారములంపించు రభస యేల*

కృ:- మీరనునది నిజమే యైనను బాలునెత్తుకొనిపోయినది ఉషగాని బాణుడు కాదుగదా

బల:- అట్లైన తనకూతురు తప్పిదమునకు అనిరుద్ధునేల బంధింపవలె?

సాత్య:- సోదరులారా! మన చర్చలతో కాలయాపన జేసినచో

గీ॥ దుర్మదాంధుడు దానవ ధూర్తుడకట
బాలుననిరుద్ధు నొక్కని బందిజేసి
ఆపదల్గల్గ జేయునో యబ్జనాభ
అమృతమైనను విషమగు నాలపింప.

నార:- సాత్యకీ నీవన్నంతయు జరుగబోయినది. ఉగ్రుడైన బాణుడు అనిరుద్ధుని కాళికకు బలియివ్వనుంకించగా మంత్రి కుంభాండుడడ్డుపడి సమగ్ర విచారణ పిదప శిక్ష నిర్ణయింతమని నచ్చచెప్పి చెఱసాలయందుంచినాడు.

బల:- అయిన నికనుపేక్షింపవీలు లేదు. శోణపురముపై దాడి వెడలుటయే తక్షణ కర్తవ్యము.

నార:- అది మాత్రమంత సులభమా బలరామా? శోణపురము శివరక్షితమగు నగరము.

శా॥ బాణుండక్కట యుద్ధవిశ్రుత మహాబాహాలందు శుంభద్గదా
పాణీ నిర్జిత దేవలోకపతియౌ పాకారిబంధించె శ
ర్వాణీ వల్లభు బంటుచేసి ఘనుడై రాణించె సంగ్రామపా
రీణుండౌ సురవైరి వానిగెలువన్ శ్రీనాథుకే కష్టమౌ.

బల:- నారదా! బాణుడెంతటి వరక్రమోపేతుండైననేమి? నేను ప్రకటాటోపాట్టహాసంబున సంగ్రామ క్షోణింబ్రవేశించి.

చం॥ హలము ధరించి సంగర మహావని జొచ్చి రణంబు సల్పుచున్
తలలు పగిల్చి బాహువుల తామర తంపరగాగద్రుంచుచున్
కలవర పాటుచే పరులు కాలుభయంబున బాఱుచుండగా
బలమున ద్వంద్వ యుద్ధమున పాపిని బాణుని బందిచేయనే

నార:- నీవంతటి పరాక్రమశాలివే కాదనను.. బాణాసురునగరమునకు అఫాలాక్షుడే రక్షకుడు. ముందాతని జయించవలె.

కృ:- అవునవును. అగ్రజా! అప్పట్టున మనమొక వ్యూహము పన్నవలె. ఆ పరమేశ్వరుని తొలుతనేనెదుర్కొని ఎట్లైనను మార్గము గావించెదను. తక్షణమే మీరు సైన్యసమేతముగా నగరముచొచ్చి రాక్షస సైన్యము నెదుర్కొనుడు. ఆపై బాణుని భరతము నేను బట్టెదను.

బల:- ఈ వ్యూహము చక్కగా నున్నది. కృష్ణా!

గీ॥ బాణుగీణునిమడియింప, ఫాలనేత్రు
సంగరంబున లేకుండ సాగనంప
బాలుననిరుద్ధుగైకొని బాణుపురము
నట్ల నడియేట ముంచెద నలిననాభ.

నార:- బాగు బాగు అప్పుడు నాకును తృప్తిగా నుండును.

కృ:- కలహభోక్తవు. కడుపునిండునులెమ్ము.

బల:- సాత్యకీ! యుద్ధ ప్రయత్నము లారభింపుడు. మన ప్రద్యుమ్ననకీ విషయము నెరింగించి అతనిని ద్వారకా నగర రక్షణ కొఱకిచ్చుటనే యుండుమని మాయాజ్ఞగా తెల్పుము.

సాత్య:- అజ్ఞ! ప్రద్యుమ్మునకు మీ యానతి తెలిపి

గీ॥ యాదవాన్వయ వీరుల ననఘమతుల
నేనె స్వయముగ ముందుండి నేర్పుమీర
శోణపురమును జేరెడి చొప్పునరసి
పరువులెత్తింతు బాణుని పురముజొత్తు.

బల:- భళా! తమ్ముడా భళా!! రథ, గజ, తురగ, పదాతిదళంబులతో, వివిధాయుధ పాణులై శత్రునిర్దళన భీకర గర్జారవంబులెసగ, రాక్షసహృదయ కంపంబులు రహించునట్లు, భూనభోంతరాళముల మనకీర్తిగానములు ధ్వనించునట్లు భేరీని నాదంబులు చెలంగ, బీభత్సరసప్రవాహము శోణపురమును ముంచెత్తునట్లు సేనావాహిని నడిపింపుము.

ఉ॥ యాదవవీర పుంగవుల నాయతపర్చి మహోన్నతిన్ సమా
రాధన జేసి శాత్రువుల రాజ్యము నాజిలొ నాహటింపగా
పాదఘటాలిచే నెగయుప్లావితధూళికణంబులున్ మహా
హ్లాదముతోడురాగ విజయాన్విత మార్గమునందు నేగుడీ

సాత్య:- చిత్తము

కృ:- అగ్రజా! మనమిక సమరసన్నద్ధులము కావలె....

నార:- మరి నాకిక సెలవొసంగుడు.

కృ:- అటులే.... అభివందనములు.

నార:- విజయోస్తు!

// లైట్స్ ఆఫ్ //

# చతుర్థాంకము - రెండవ రంగము

*(ఆకాశగమనంబున నారదుడు)*

నార:- నారాయణ! నారాయణ! ఆహా! నేటికి నానాటకము రసకందాయమున బడినది. మొదట శివకేశవుల సమరము పిదప బాణాసుర గర్వభంగము. ఆపైన ఉషానిరుద్ధుల పరిణయము.... ఆహా! నాకిక విందు భోజనమే....

// పాట //

*తెలియగ తరమా నారదు లీలా*
*త్రిభువనంబులం దేరికినైనా*
*సృష్టికర్తయగు బ్రహ్మకునైనా* ॥ తెలియగ ॥

*కయ్యమునందే కల్యాణంబును*
*కళ్యాణంబున కలహ బీజమును*
*అటుదిటు ఇటుదటు యెటులైనను నే*
*నయమున జేసెద నేర్పుఘటింపగ* ॥ తెలియగ ॥

*కలహాభోక్తయని యందురెగాని*
*లోక కళ్యాణ కారకుండనని*
*నా యొనర్చిన కార్యము ద్వారా*
*తెలిసేదెందరు? తెలియనిదెందరు* ॥ తెలియగ ॥

*భవబంధంబుల జోలికి పోక*
*సారసాక్షి సాధింపులు పడక*
*రక్తిని వీడి ముక్తి కొరకునే*
*అహరహంబు తపియించుట తెలియరు* ॥ తెలియగ ॥

// నిష్క్రమణ //

# పంచమాంకము - మొదటి రంగము

*(శోణపుర కోట ద్వారమున శంకరుడు కావలియుండగా కృష్ణుడు ప్రవేశము)*

కృ:- ఆదిదేవునకభివాదములు

శంక:- ఎవరు? (చూసి) కృష్ణస్వామియా ప్రత్యభివాదము - ఏమిటు విచ్చేసితిరి?

కృ:- బాణాసురుడు నామనుమడగు అనిరుద్ధుని బంధించినాడని తెలిసి వానిమదమడంచి అనిరుద్ధుకొనిపోవుటకై వచ్చినాడ.

శంక:- కృష్ణా! నీవు వచ్చిన పని మంచిదియే. బలగర్వమున కన్నుగానకయున్న బాణాసురునకు గర్వభంగముకాదగ్గదే.... కానీ నేనిచట ద్వారపాలకుండనై నగరరక్షకుడుగా నుంటిని గాన నీవు పురప్రవేశము చేయుటకు వీలుగాదు.

కృ:- అదేమి నీలకంఠా! ఒక రాక్షసాధమునిపై నీవింత మక్కువచూపుట భావ్యము గాదు. దేవదేవుడవైన నీచేతనే కావలికాయించువాని కండకావర మణచవలదా?

శంక:- వలదని నేనంటినా? ఈ పరిస్థితిలో లోనికి పోకుండనిన్ను నిరోధించుటయే నా కర్తవ్యము.

కృ:- శంకరా! నా మాటవిని నన్ను నిరోధింపకుము.

గీ॥ *ధూర్తుడగువాడు వరగర్వదూషితుండు*
*బాణువోడించి గర్వంబు భంగపరచి*
*ఉషను ననిరుద్ధు చేరిచి యుత్సవముగ*
*పాణిగ్రహియింపచేతును ఫాలనేత్ర.*

శంక:- నీమాట వినలేక పోవుచున్నందుకు విచారించుచున్నాను.

గీ॥ *కృష్ణ! బాణుండు నాదగు కృపను బడసి*
*శోణపురమును మహితంపు శోభ లెనగ*
*పాలనము చేయుచుండెను ప్రాపుమీర*
*వాని రక్షించుబాధ్యత వదల లేను.*

కృ:- అయిననిప్పుడేమందువు?

శంక:- అనుటకేమున్నది? శోణపురప్రవేశము వీలుగాదందును.

కృ:- శంకరా! వీలుగావలె.

శంక:- అది సాధ్యముగాదు. ఇచ్చట నున్నది ఫాలనేత్రుడు.

కృ:- ఫాలనేత్రా అధర్మపక్షము వహించిన ఎంతగొప్పవారికైనను పరాభవము తప్పదు - నీవు మార్గము నివ్వకున్నచో నేనే మార్గము చేసుకొనవలసి యుండును.

శంక:- నేనిచ్చటనుండగా అది అసాధ్యము.

కృ:- నీలకంధరా నీవింత విశ్వాసహీనుడవగుదు వనుకొనలేదు.

శంక:- కృష్ణా! నేను విశ్వాసహీనుడనా?

కృ:- కాదామరి....

గీ॥ అలజలంధరు చంపించు నవసరమున
భస్మమొనరించు నావ్రకు బాపువేళ
దానవేంద్రులు ధర్మంబుదప్పునెడల
నాదుమేలును మఱచితో నాగభూష

శంక:- కృష్ణా! నేను మాత్రము నీకు మేలొనరింపలేదా

కృ:- ఏమది

శంక:- గీ॥ పాలసంద్రము వెడలిన హాలహలము
శప్తు నీ బావమరిదిని చంద్రునకట
యేను భరియించి, ధరియించి యిలను బ్రోవ
నాదు మేలును గాంచవో నలిన నాభ

కృ:- వెనుకటికేదో చేసితినననేల నేడునా మార్గము నడ్డుచుంటివిగా

శంక:- అదిబాణుని ద్వారపాలకునిగా నా కర్తవ్యమంటిని గదా!

కృ:- ఆహా నీకర్తవ్య నిర్వహణము నేనెరుంగనిదా

గీ॥ శీతనగమందు లయకార్య సిద్ధి విడిచి
తపము చేసుక బ్రతుకుచు దనరునాడు
భక్తులకు వరములొసంగి పాఱునాడు
నీదు కర్తవ్యమెరుగనే నీలకంఠ

శంక:- కృష్ణా మంచిచెడులను విచారింపక మాట్లాడుచున్నావు. అట్లైన నీవును నీ కర్తవ్యమును విస్మరించి అనేక మాయల ననుసరింపలేదా

కృ:- ఏమవి?

శంక:- గీ॥ అలజరాసంధు దునుమాడ నలవిగాక
సంభ్రమందున ద్వారకన్ సాకలేదా
వనిత కొరకు వైకుంఠము వదలలేదా
నీదు చేతల నెరుగనే నీరజాక్ష

కృ:- శంకరా! వృథా మాటల వలన పనిలేదు. దారివిడుతువా? లేదా?

శంక:- దారివిడుచుట ధర్మముగాదని చెప్పితిని గదా

కృ:- అట్లయిన యుద్ధమునకు సిద్ధముగమ్ము

శంక:- యుద్ధమునకు సిద్ధమే.

కృ:- ఇదిగో చరాచరజగత్తునే భస్మీపటలము గావింపగల ఆగ్నేయాస్త్రము. (మంత్రించి వదలును)

శంక:- యదునందనా! ఇదిగో వారుణాస్త్రము.... (వదలి) నీ ఆగ్నేయాస్త్రముపని సరి... ఇదిగో ఇదిగాంచుముసర్వజగన్నిశీథినీ సృజనమగు మేఘాస్త్రము.

కృ:- మేఘంబుల చెల్లాచెదరుచేయగల్గిన వాయవ్యాస్త్రమిదిగో......... నీ మేఘముల వనగూలినది... శంకరా! ఇకనా నారాయణాస్త్రమునే ప్రయోగించుచున్నాను కాచుకొనుము.

శంక:- కృష్ణా! నేనును పాశుపతాస్త్రమునే ప్రయోగించుచున్నాను కాచుకొనుము.

కృ:- (స్వగతము) ఆహా! ఏమి యీ పాశుపతాస్త్ర ప్రభావము నా నారాయణాస్త్రమునే నిలువరించి పోరాడగలుగుచున్నదే.

శంక:- ఆహా! ఏమి యీ నారాయణాస్త్ర ప్రభావము నా పాశుపతాస్త్రముతో సమముగా పోరుచున్నదే.

కృ:- శంకరా! ఇక నా సుదర్శన చక్రమునే ప్రయోగించుచున్నాను కాచుకొనుము.

కం॥ నేనే స్థితి కరుడనగుదు
నేనిన్ నారాయణాంశ నేగలిగితినే
నిన్, నా చక్రము శంకరు
నీ నా డోడించి దారి నేర్పరచునికన్

శంక:- కృష్ణా నేనును మదీయ హస్త భూషణమగు త్రిశూలమునే ప్రయోగించుచున్నాను కాచుకొనుము.

కం॥ నేనే లయకరుడ నగుదు
నేనిన్ బాణుని వశుండనేనిన్ జయతన్
నేనీ నాడుత్రిశూలము
నన్ నారాయణు సమరమున నిలువరింతున్

కృ:- శంకరా నీవికలేవు

శంక:- కృష్ణా నీవికమిగలవు

నార:- (శివకేశవులు త్రిశూలచక్రముల ప్రయోగింపనుండగా త్వరగా వచ్చి) శివకేశవులారా! విలయమును సృజింతురాయేమి? మీ పోరం జగత్ప్రళయముగావించనున్నది.... మీ సమస్య నేను పరిష్కరింతును గాని ముందు మీమీ ఆయుధముల నుపసంహరింపుడు.

కృ:- నారదా! నాకు శోణపురప్రవేశముగావలె

శంక:- నారదా శోణపురమును నేను రక్షించి తీరవలె

నార:- హరిహరులారా! మీ యిరువురకును సమ్మతమగు పరిష్కారము నేనొసర్తునంటినిగదా! ముందా ఆయుధముల నుపసంహరించి జగద్విలయమునాపుడు.

కృ&శం:- సరియే (ఆయుధములనుపసంహరింతురు)

నార:- ఆహా! క్షణమాత్రమున జగద్విలయముదప్పినది... ఆ శంకరా నీవు శోణపురమును రక్షింపవలెగదా?

కృ:- అంతియే!

నార:- ఫాలాక్షా! బాణాసురుని కేతనము పతనమైనప్పుడు, నీ యంత వానితో సమరము జరిగి ఆతని చేతులబరువుతీరునని శపించి తివిగదా

శంక:- అవును

నార:- అదిగో అటుగాంచుడు... బాణుని కేతనము పతనమైనది

శంక:- అవును నిజమే

నార:- అందుచేత మీ శాపము ఇప్పుడు కృష్ణుని ద్వారా నెరవేరవలె. అది బాణునకు నిష్టమే గదా! పైగా

గీ॥ సంగరంబొనర్చితివిట సాహసమున
మాధవుని నీవు వదలిన మాటరాదు
నీదు శాపంబు నెరవేరు నిక్కువంబు
బాణురక్షణ కొనసాగు బాగుగాను

శంక:- నిజమే నా శాపమువెరవేరవలె. బాణుడు రక్షింపబడవలె అట్లయినచో నాకభ్యంతరము లేదు.

నార:- కృష్ణా నీవేమందువు.

కృ:- నారదా నాకు కావలసినదియునంతే...

నార:- అంతియేకాదు మనకందరకు కావలసిన పరమార్థమింకొకటున్నది.

కృ:- ఏమది?

నార:- శంకరునికి ద్వారపాలక పదవి నుండి విముక్తి.

కృ:- తథాస్తు... (అందరూ నవ్వుతుండగా లైట్స్ ఆఫ్)

///

# పంచమాంకము - రెండవ రంగము

*(బాణాసురుడు సమరోత్సాహంతో వస్తుంటాడు కృష్ణుడెదురౌతాడు)*

బాణా:- ఓహో నీవేనా కృష్ణుడవు? నీ రూపరేఖాదుల గూర్చి వినియుంటినిలే.

కృ:- అయిన పరిచయమైనట్లే. బాణాసురా! సమరమునకు ముందు సామరస్యముగా ప్రయత్నించుట మా అచారము. ఉషాకన్యను మా అనిరుద్ధునకిచ్చి వివాహంబుగావించి నావెంటనంపుము. బంధువులము కావలసిన మనకు భండనమేల?

బాణా:- హహహ! ఏమేమి? కృష్ణా ఏమంటివేమంటివి? మిమ్మాదరించి, నీ పౌత్రునకు మాకన్యనొసంగి పంపవలెనా? హు! యుక్తాయుక్త విచక్షణా దూరుడై నాకూతు జీవితముతో ఆడుకున్న అధూర్తుని కాళికాదేవికి బలియిచ్చుటయే మా ఆచారము.

కృ:- అయినచో యుద్ధమనివార్యమన్నమాట.

బాణా:- శంకరునెదిరించి నిలిచిన నీ పరాక్రమము నభినందించుచున్నాను. ఇట్టివానితోడనే సంగరమొనరింపవలయునని యెన్నినాళ్ళ నుండియో కుతూహలముగానున్నది. కొంతసేపు వినోదము కొరకునీతో సంగరకేళి జరిపి, రణంబు పట్ల నాకు తృప్తి కలిగిన పిదప నిన్ను బంధించినీ మనుమడితో పాటు కాళికాదేవికి బలియిత్తును.

కృ:- (నవ్వి) బాణాసురా! నన్ను బంధించి బలియిచ్చునంతటి గొప్పవాడివానీవు? నాతో సంగరకేళి సలువగలవా? సరిసరి రమ్ము! నీ వేయిచేతుల సలుపుతీర్తును.

బాణా:- నవ్వి! హహహ! కృష్ణా! ఇవి గోపవధూకరములుగావు ఆలింగనమున ననునయింప - చండప్రచండ పరాక్రమనమన్వితమగు బాణాసురు సహస్రబాహుదండంబులు.... నేను

ఉ॥ శోణపురాధినాథుడను శుంభదమోఘ సహస్ర బాహుడన్
స్థాణుని భక్తిచే గెలువజాలితి నన్నెదిరించి దేవతల్
శోణపురంబునన్ సతత శోకమహాబ్ధిని మున్గుచుండగా
త్రాణుడు లేడు నీకు నిక తామసమూడ్చెదరమ్ము యాదవా!

కృ:- బాణాసురా! ఆత్మప్రశంస లేల?

ఉ॥ మనమున సిగ్గులేక నను మానమొకించుక దోపనీక నీ
ఘనతను కొండలంతలుగ కల్పనజేసి వచింపన్యాయమే
అనిమొన నిల్చి చేకలువ కాత్మప్రశంసకు జొచ్చితీవు. నే
ననిన సహస్ర శీర్ష పద హస్త విరాట్పురుషుండ మందుడా!

బాణా:- (నవ్వి) కృష్ణా! నీవు సహస్ర శీర్షపదహస్త విరాట్పురుషుండవా? ఇన్ని విశేషణములు తగిలించుకున్న నీది ఆత్మప్రశంసకాదు కాబోలు? అయినా ఆత్మ ప్రశంసమేలుకాదన్ననానుడి నాకు తెలియక కాదు. పాపము నీవు క్షణకాలమున మంటలలో పడిన శలభమువలె మదీయ తీవ్రపరాక్రమాగ్ని జ్వాలాభీల కీలలకెఱయై నశింపనుంకించుచుంటివిగాన నట్లు తెలుపవలసి వచ్చినది. అయినా నరసురయక్షకిన్నెరకింపురుష విద్యాధరాదులందరినీ నిర్జించిన నాకు, అష్ట దిక్పాలనహితముగా దేవేంద్రునిచే వెట్టిగొనుచున్ననాకు, శంకరునే బంటుగావించుకొని చరాచర జగత్తునే అధీనమునందుంచుకొనిననాకు అహహ! ఒక్క, ఒక్కనరాధముడవైన నిన్ను నిర్జించుట - ఆ - క్షణమాత్రము... కానీ నా చేతులతీట తీర్చుకొనుటకై నీతో ఆడుకొనవలసియున్నది..... అందుకే..... అందుకే సమరకేళికాహ్వానించుచున్నాను.

కృ:- వెఱ్ఱిబాణుడా! భక్తికి కట్టువడి భర్గుడు నీ ద్వారమున కాపున్నంత మాత్రమున చరాచరజగత్తే నీ అధీనములో నున్నట్లు భ్రమించు నీ మందబుద్ధికి రణకేళీవిజయము గూడనా రమ్ము! నిన్నుజయించి అనిరుద్ధు గొంపోయెద.

బాణా:- కృష్ణా! ఉపేక్షించిన కొలది నీవాచాలత అధికమగుచున్నది ఇక యుద్ధమునకు సంసిద్ధుడవుగమ్ము.

కృ:- బాణాసురా! నేను సిద్ధమే... ఇదిగో ఈ దివ్యాస్త్రమునుగాచుకొనుము. (అస్త్రముసంధించును)

బాణా:- ఇదిగో నేనొకదారుణాస్త్రమునంపుచున్నాను. (సంధించి) కృష్ణా! ఏమైనది నీ దివ్యాస్త్రము? నేనొకశక్తిని వదలుచున్నాను ఇదిగాచుకొనుము.. జై భవానీ!.... (వదలును)

కృ:- నీశక్తి పని ఈ దివ్యాస్త్రమున సరి.... (వదలి) బాణాసురా! నీతో ఆలస్యమేల ఇదిగో ఈ నాగాస్త్రము నిన్ను నిర్వీర్యుని జేయును (సంధించును)

బాణా:- ఇదిగోనేనొక..... (బాధ) ఏమిది? నాకేమగుచున్నది? కృష్ణధనుర్విముక్త తీవ్రశరధాటికి నేతాళలేకున్నానే... నా సహస్రబాహుబలమేమైనది.... నేనెందులకిట్లు నిర్వీర్యుడనగుచున్నాను... నా పంతములన్నియు

ఏమగును? (తట్టుకొనజాలక కూలబడిపోవును...)

కృ:- బాణాసురా! ఏమి యోజించుచున్నావు? చేతులసలువులు తీరినవా? ఏమయినవి నీ ప్రగల్భములు?

శా॥ *ఏరా రాక్షసధూర్త! నీ భుజబలం బేపొంతలన్ దాగెరా?*
*రారా నన్నిట మారణంబు నలుపన్ రావేమిరా యింకనున్*
*పోరా టంబిక చాలెనా సలుపులున్ పోలేదనీకింకనున్*
*ఆరాటంబును దీర్తురా కరయుగం బల్పాత్మనే నిల్పుచున్*

బాణా:- అ..... ఏమిటి కృష్ణుడెంతరెచ్చగొట్టినను నాలో శక్తి సమకూరుట లేదు.... ఈతడు నరుడుగాడా.... ఆవైకుంఠమును వీడిన విష్ణువా? .... ఏమీ... విష్ణు.... మాకాగర్భశాత్రువుండగు విష్ణువు.... నారాయ.... రేయ్! (ఒక్కసారిగా లేచి)

కృ:- ఆగుబాణాసురా! ఆగుము. ఇప్పటికొనరించిన సమరము చాలును.... ఇదే మదీయచక్రానలజ్వాలనుండి రక్షించుకొనుము.

ఉ॥ *భీకరమై మహోన్నతవిభీషణరావము లుద్భవింపగా*
*ఆకసమంతయున్ చటులరార్భటి తేజములుద్గమింపగా*
*నాకర నిర్గతం బగుచు నాల్కలు జాచుచు చక్ర మార్భటిన్*
*నీకరముల్ ద్విశేషముగ వేగమెద్రుంచును గాంచుమా యికన్*

బాణా:- అ..... అ..... ఏమీ? ఈ చక్రతేజస్సు? .... అ. అ... అబ్బా! (తెరలోపడిపోవును. శంకరుడు ప్రవేశించి)

శంక:- కృష్ణా

గీ॥ *బాన యొనరించినాడవు బాణుగావ*
*మాదు భక్తుని కరుణించి మనుపుమయ్య*
*బాణు వేయికరంబుల బరువుదీరె*
*నీదుకోరిక నెరవేరె నీర జాక్ష*

కృ:- నీలకంఠా! నీ భక్తునికి రెండు హస్తములు మాత్రముంచి తక్కిన హస్తములన్నియు సుదర్శనచక్రముచే ఖండించితిని. నీవు వాని పిలువుము వాడు రాగలడు.

శంక:- బాణాసురా! భక్తా బాణాసురా! బాణాసురా!

బాణా:- (ప్రవేశించి) నమో నమః ఆదిదేవా! నా ప్రాణములు నిలిపితివా స్వామీ!.... నమో నమః

శంక:- బాణాసురా! నీ ప్రాణములు నిలిపినది నేను గాదు... ఆ కృష్ణపరమాత్మయే! నీతాత ప్రహ్లాదుడాతని భక్తుడకుటచే నీకు జీవము ప్రసాదించినాడు... ఆతని శరణువేడుము.

బాణా:- హే! కృష్ణ ప్రభూ! నన్ను క్షమింపుడు. బలగర్వమున కన్ను గానక మిమ్మెదిరించినాను. నా బాహువుల బలము సర్వము ఖర్వమైనది. శంకరునిద్వారపాలకునిగా నియమించి పాపమొనరించినాను... నేటితో నా స్వామికిక కైలాసమే నివాసముకాగలదు... నన్ను క్షమింపుడు. (కృష్ణుని పాదములబడును) రూపములు వేరైననూ శివకేశవులొక్కరేయని అర్ధమైనది.

కృ:- బాణాసురా! నీ గర్వభంగమున ఎన్నో సమస్యలు తీరినవి - మరి మా అనిరుద్ధుని....

బాణా:- అనిరుద్ధుడింతవరకు నా బందీ! ఇక జీవితాంతము ఉషాకుమారి ప్రణయగేహమున బందీగా యుండగలడు... మీ సమక్షముననే పరిణయమొనర్చెదను. మంత్రీ కుంభాండా!

కుంభాం:- ప్రభూ.

బాణా:- పుష్పమాలాసమేతముగా ఉషా నిరుద్ధుల తోడ్కొనిరమ్ము

కుంభాం:- అటులనే ప్రభూ (వెళ్ళును).

కృ:- శంకరా! నీ భక్తుడైన బాణుడు సత్క్రమ పథగామియైనందున అతనికొకవరం బిచ్చుచున్నాను.

గీ॥ *ప్రమథ గణములయందున ప్రముఖుడగుచు*
*భక్తి భవదీయ సన్నిధిన్ భవ్యమతిని*
*బాణుడుండును జీవంబు బాయకుండ*
*భక్తరక్షణపరతంత్ర ఫాలనేత్ర*

బాణా:- ఆహా! ఏమినాభాగ్యము. భక్తవశంకరుడైన శంకరుని సన్నిధానమే నా నివాసమైనది... హే కృష్ణా! కృతజ్ఞుడను.

శంక:- కృష్ణా! నా భక్తుడగు బాణునకు తగిన స్థానమొసంగితివి.

గీ॥ *బాహువుల గర్వభంగము భవవినాశ*
*నీదుచేతుల జరుగంగ నిర్నిమేష*
*పరమభక్తుడు బాణుడౌ పాపనాశ*
*తగిన స్థానము నొసగితి తాపనాశ*

నార:- శివకేశవులారా! బాణుడు కోరుకొనినదీ శంకరుసన్నిధానమే ఇందులకే తపముగావించినాడు. కానీ అహంకారమున శంకరుని తన సన్నిధానమునకే రప్పించినాడు. ఇప్పుడు శివకేశవులు అభేద స్వరూపులని.... ఇరువురి బాధ్యతలూ సృష్టి స్థితిలయంబులేనని తెలుసుకొనుటచే అహంకార భంగము జ్ఞానోదయమును జరిగినది. కాన శంకరు సన్నిధి చేరినాడు. మొదటిది భక్తి. రెండవది ముక్తి. (కుంభాండుడు పుష్పమాలా సమేతుడై ఉషానిరుద్ధులతో వచ్చును).

అని:- తాతగారికి ప్రణామములు, దేవదేవునకభివాదములు, సురమౌనులకు నమస్కారము.

ఉష:- పెద్దలందరికీ ప్రణామములు.

బాణా:- అమ్మా! ఉషా! నీ కోరిక నెరవేరుచున్నది తల్లీ..... నాయనా అనిరుద్ధా! నా ప్రవర్తనకు బాధపడకునాయనా.....ఇదిగో నా కూతురును నీ కప్పగించుచున్నాడను. చేపట్టుము. (ఇద్దరి చేతులు కలిపి ప్రక్కకు జరుగును) మంత్రిపుంగవా హారములందించుడు.

కృ:- కానిండు - హారములు మార్చుకొని దంపతులు గండు. (ఉషానిరుద్ధులు హారములు మార్చుకొందురు. అందరు ఆశీర్వదింతురు)

బాణా:- దేవదేవులారా! శివకేశవులున్నారు. బ్రహ్మలేకున్నను బ్రహ్మమానసపుత్రుడు నారదుడున్నాడు. కనుక త్రిమూర్తులున్నట్లే కాగలదు కాన లోకకల్యాణమొనగూర్తురుగాక.

నార:- అవును.

గీ॥ ముజ్జగంబులు నెంతయు ముదముఁబొంద
సర్వజనులును సతతము సంతసింప
సృష్టి రక్షణ లయలనంతష్టి గలుగ
ధర్మమార్గము వీడక దనియుగాక.

కృ&శం:- తథాస్తు! తథాస్తు!! (ఆశీర్వదిస్తున్న స్థితి)

(అందరు నమస్కరిస్తూ స్థితి)

* * *

**ఉషాపరిణయము ... సంపూర్ణము**